# నలమహారాజకథలు

గ్రంథకర్త:

యస్. యస్. శాస్త్రిగారు.



పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్యా,

శ్రీసత్యనారాయణ బుక్ డిపో

రాజమహేంద్రవరము.

1937

## బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారిచే రచియింపఁబడిన నవలలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహల్యాబాయి | 0 | 12 | శాపము | 1 | 0 |
| రాజరత్నం | 0 | 12 | ప్రహసనమంజరి | 0 | 8 |
| కృష్ణవేణి | 0 | 12 | Tit-Bits అను వినోదములు | | |
| హేమలత | 0 | 12 | 1 వ భాగము | 0 | 10 |
| రామచంద్రవిజయము | 0 | 12 | 2 వ ,, | 0 | 10 |
| రామకృష్ణపరమహంస Life & Teaching | 0 | 8 | సుధాశరశ్చంద్రము | 1 | 0 |
| | | | రాజస్థానకథావళి 1 వ భా | 1 | 0 |
| సౌందర్యతిలక | 1 | 0 | ,, 2 వ భా | 1 | 0 |
| కర్పూరమంజరి 1 వ భా | 1 | 0 | సిద్ధార్థచరిత్ర | 0 | 12 |
| 2 వ భా | 1 | 0 | రఘుకులచరిత్ర | 0 | 10 |
| నవ్వులగని 1 వ భా | 1 | 0 | నానకుచరిత్ర | 0 | 12 |
| ,, 2 వ భా | 0 | 8 | గురుగోవిందచరిత్ర | 0 | 12 |
| గణపతి 1 వ భా | 0 | 12 | | | |
| ,, 2 వ భా | 0 | 12 | | | |

## కథలు—చరిత్రలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రీనాథకవిచరిత్ర | 0 | 8 | శ్రీరామవనవాసము | 0 | 12 |
| వేములవాడభీమకవిచరిత్ర | 0 | 8 | భేతాళపంచవింశతికథలు | 0 | 12 |
| తెనాలి రామకృష్ణకవి చరిత్ర | 0 | 8 | పంద్రెండురాజులకథలు | 0 | 12 |
| | | | స్త్రీలవ్రతకథలు 1,2,3 భా | 0 | 12 |
| బమ్మెర పోతనకవి చరిత్ర | 0 | 8 | మహాపతివ్రతల కథలు | 0 | 8 |
| శ్రీకృష్ణదేవరాయలచరిత్ర | 0 | 8 | మదనకామరాజు కథలు | 0 | 12 |
| నలమహారాజు కథలు (వచనం) | 0 | 6 | 16 రాజుల కథలు | 0 | 12 |
| | | | పురూరవచక్రవర్తికథలు | 0 | 6 |

# నలమహారాజుకథలు



గ్రంథకర్త:

యస్. యస్. శాస్త్రిగారు.



పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్యా,

శ్రీసత్యనారాయణ బుక్ డిపో,

రాజమహేంద్రవరము.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము:

శ్రీ సత్యానంద ప్రెస్ నందు

ముద్రింపఁబడియె.

1937

 [వెల **0—12—0**

# విషయసూచిక



ప్రథమభాగము.



ద్వితీయభాగము.

ఓమ్.

శ్రీ రా మా !

# శ్రీ నలమహారాజు కథలు.



## — ఉత్పత్తి. —



శ్రీమన్మహీమండలంబునకు మండనాయమానంబైన నిషధదేశంబును బాలించి, వినుతికెక్కిన షట్చక్రవర్తులలో నొక్కఁడయిన నల సార్వభౌముని సుపవిత్ర చరిత్రము, వ్యాసమహర్షి ప్రోక్తమయిన పంచమ వేద ప్రఖ్యాతిఁబరఁగు భారతమునందలిది. అద్దానిని వ్యాసాదిసత్కవీశ్వరులకు భక్తిపూర్వక ప్రణామములాచరించి మీకుఁ జెప్పుచున్నాను. అయ్యది సమస్తాభరణములలో నొక యాభరణప్రాయమై నలపతకమను పేరఁబరఁగుచున్నది. దానిని జదివినను, వినినను, వ్రాసినను, పుణ్యముచేకూరును; పాపము దూరమగును; దుష్టగ్రహబాధలు తొలఁగిపోవును; కలిపురుషుఁడీచరిత్రమునం దాసక్తిగలవారిని కన్నెత్తి చూడలేఁడు; శనైశ్చరుఁడీ నలమహారాజు నామమును సంస్మరించిన వారిని సమీపింపవెఱచును. మఱియు నలుని గుణగణాదులను, పేరు ప్రతిష్ఠలను శక్తికొలఁది సన్నుతించు సజ్జనులనుజూచి సురలు సంతసింతురు; అసురులు వెఱఁగందుదురు; ఈ చరిత్రమున కింతప్రాముఖ్యత గలుగుటకు హేతువరయుఁడు. “ నావిష్ణుః పృధివీపతిః ” అను నార్యోక్తియున్నదిగదా ! దానివలన విష్ణువు గానివాఁడు భూపతికాఁజాలఁడనిగదా భావము ! అనఁగా రాజగువానిలో విష్ణ్వంశమున్నదని

తెల్లమగుచున్నదిగదా! కాఁబట్టి భగవదంశసంభూతుఁడగు నలుని దివ్యచారిత్ర మవశ్యపఠనీయమనుట నిక్కువము. అద్దానిని బ్రహ్మ క్షత్త్రియవైశ్య శూద్ర జాతిభేదముగాని, లింగభేదముగాని, మాత భేదముగాని లేక, స్త్రీపురుషులెల్లరును జదువవచ్చును; వినవచ్చును; వ్రాయవచ్చును; తాము విన్నదానిని, తాము వ్రాసినదానిని పరులకు బోధింపవచ్చును. పావనమును, పాతకహరమునునగు నీచరిత్రమును పూర్వమెవరిచేత నెవరికి ఎప్పుడు చెప్పఁబడెనో, వివరించుచున్నాను.

పూర్వము ద్వాపరయుగమున చంద్రవంశోద్భవుండును, జాత్యంధుఁడును నగుధృతరాష్ట్రునకు దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు మున్నగువారు నూర్వురు పుత్త్రులుదయించిరి. ధృతరాష్ట్రుని సహోదరుండయిన పాండుమహీజానికి ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు అనుకుమారు లేవురుజనించిరి. ధృతరాష్ట్రుని సుతులు ధార్తరాష్ట్రులనియుఁ గౌరవులనియుఁ బిలువఁబడుచుండిరి. పాండురాజ పుత్త్రులు పాండవులనియుఁ గౌంతేయులనియుఁ బిలువఁబడుచుండిరి. పాండవులు ధర్మాత్ములు; సత్యసంధులు; త్యాగశీలురు; సజ్జనులు; శౌర్యధైర్యపరాక్రమోపేతులు; నిగర్వచూడామణులు. కౌరవులు దుర్మార్గులు; మదాంధులు; గర్వోద్రిక్తచిత్తులు. పాలుపంపకము లలోఁ గౌరవజ్యేష్ఠుఁడయిన దుర్యోధనుఁడు పాండవుల నన్యాయము చేసెను. అంతతోఁ దృప్తినొందక, వారికిఁ గడుపున కన్నమును, గట్టుటకు బట్టయునులేని నిరుపేదలఁ జేయఁగోరి మేనమామయగు శకునితో మంతనముండి మాయపాచికలం గల్పించెను. ఆ కాలమున ధర్మరాజు, భీమార్జున నకులసహదేవులు భక్తితాత్పర్యములతోఁ దన్నుఁగొల్చుచుండ నాఖండలవైభవంబున నింద్రప్రస్థరాజ్యసింహాసన మలంకరించి, ప్రాజ్యసామ్రాజ్యమును బాలించుచుండెను. ధర్మజుని రాజ్యమపహరింపఁదలఁచి దుర్యోధనుఁడు ద్యూతమున కాహ్వానించెను. ఆ ద్యూత

మునందు శకుని మాయపాచికలువేసి జయముపొందఁగా ధర్మరాజు ఓడిపోయెను ; రాజ్యమును, సిరులను, సంపదలను, పశువులను, రథములను, గజములను, తురంగములను, మడులను, మాన్యములను—ఇవి యవి యననేల ? సర్వస్వము నోడిపోయెను. తరువాత ధర్మనందనుండు భీమార్జున నకులసహదేవులగు సహోదరులతోను, అర్ధాంగియగు ద్రౌపదితోను హస్తినాపురము విడిచి అరణ్యవాసము సేయఁబోయెను. ధర్మనందనుండు పురమువిడిచి పోవుచున్నపు డంతకుఁబూర్వమునుండియు నాశ్రితులైయున్న బ్రాహ్మణులు పదియాఱువేలమంది వెంట బయలుదేరిరి. అసంఖ్యాకములయిన గోగణంబులు బయలుదేరెను—పాండవులు బ్రాహ్మణబృందములతోను, గోగణంబులతోను దుర్గమారణ్యంబులంబడి పోయిపోయి కామ్యవనము, ద్రుపదవనము, ఇంద్రప్రస్థవనము మున్నగు వలములెల్లదర్శించి యందందుఁ గొంతకొంతకాలము నసించుచుఁ గడపట ద్రుపదవనమునే తమ వాసస్థానముగా నేర్పఱచుకొనిరి. అందుఁ దమకును, విప్రవరేణ్యులకును, గోబృందమునకును వాసయోగ్యములుగా సుందరీతిని పటకుటీరములను దర్శనీయములును, మనోజ్ఞములుగను నిర్మించిరి. ధర్మరాజాదులు ప్రియపత్నియగు ద్రౌపదితో నాపటకుటీరములందు నివసించుచుఁ గందమూలాదులను భుజించుచుండిరి. భక్తాగ్రగణ్యులును, సకలార్థకోవిదులునగు మార్కండేయాది మహర్షులును, పురోహితుండయిన ధౌమ్యుండును, సర్వకాలములయందు ధర్మార్థకామమోక్షములనఁబడు చతుర్విధపురుషార్థములను ప్రబోధించు పురాణపురుషుల జీవితములను ఆచరణీయపుణ్యకర్మలను, గ్రాహ్యధర్మములను, ఎఱిఁగించుచుండిరి. మునిజనులవలనను ద్విజులవలనను ధర్మవిషయము లాలకించుచున్న ధర్మనందనాదులు, వనవాసక్లేశమును సహించుచుండిరి.

## — బృహదశ్వుఁడు ధర్మజునికడ కేతెంచుట —

ఈ ప్రకారము కొన్ని దినములు గడవఁగా నొక్కదినంబున మునిశిఖామణియయిన బృహదశ్వుఁడు శిష్యసమేతుఁడై, కృష్ణాజినము నొకచేతను, దండకమండలముల నింకొకచేతను బూని, నుదుట విభూతి రేఖలను దీర్చిదిద్ది, మెడలో రుదురాకపేరులఁ గుదురుకొలిపి యిల కవతరించిన శంభుడోయనునట్లుగా విలసిల్లుచు నేతెంచి, ద్రుపదవనముం బ్రవేశించెను. ఆ మహాత్ముని యాగమనమును గుఱించి యంతకు మున్నె యాశ్రితులవలన విన్నవాఁడై, ధర్మనందనుఁడు బంధుమిత్రాదులతో నెదురేఁగి ప్రత్యుత్థానముసేసి, నిజాశ్రమంబునకుఁ దోకొని యుచితాసనంబునఁ గూరుచుండఁ బ్రార్థించి, అంజలిఘటించి, మృదు మధురభాషణంబుల నిట్లనెను. "స్వామీ! బృహదశ్వమునిచంద్రమా! తావకీయదర్శనంబు కతంబున నాయాశ్రమంబు పవిత్రమయినది. మేమెల్లరము ధన్యులమయితిమి. మాడెందములందమందానందము సందడించుచున్నది. దేవా! దుష్టులగు రాక్షసులవలన పీడలేక, తమ యజ్ఞాది పుణ్యకర్మములు నిర్విఘ్నముగా సాగుచున్నవా? తమకును, దమ దివ్యపాదారవింద సేవాతత్పరులగు నంతేవాసిజనులకును గుశలమే గదా!" ఈపలుకులకు బృహదశ్వులవారు మందహాసమొనరించి, సాదరముగ ధర్మనందను నవలోకించి యిట్లనెను. "ధర్మపుత్రా! భగవదనుగ్రహమున నేనును శిష్యులును సుఖముగనే యున్నాము. కాని మాకు సుఖదుఃఖములతో నిమిత్తములేదుగదా! జ్ఞానులగువారు ఏదయిన పుణ్యకర్మ మాచరించినపుడు దానిఫలమును గోరరు; కర్తృత్వాధికారమును దమపైఁ బెట్టుకొనరు; మఱియు నాపుణ్యకర్మము వలనఁ దమకోరిక యీడేఱిన నుప్పొంగరు; ఈడేరకున్న వైకల్యము నొందరు; సుఖదుఃఖములు దేహాభిమానమున్నవారికిఁ గాని, ఆత్మసందర్శనాభిలాషులకెక్కడివి? అనవరత మాత్మావలోకనాయత్తచిత్తులమై

యుండు మాకు సుఖమన్న మోదములేదు. దుఃఖమన్న ఖేదములేదు. మేమా రెంటిని సమదృష్టితో నరసెదము; రెంటియందును సమభావమునే యుంచెదము. కాఁబట్టి మామాట యట్లుండనిమ్ము. యుధిష్ఠిరా! అనుజులకును, నీకును, మహాసాధ్వియగు ద్రుపదరాజపుత్త్రికకును, మీ మాతయగు కుంతీదేవికిని క్షేమమేగదా!" ధర్మరాజు బృహదశ్వునకుఁ దత్క్షణమే సమాధానమీయఁజాలక పోయెను; అతని నేత్రము లశ్రుపూరితములు కాఁగా డగ్గుత్తికతో నవనతవదనుఁడై మెల్లన నిట్లుమాఱువలికెను. "ఓ మునికులతిలకా! మీకు నేనేమని ప్రత్యుత్తరము వచింపఁగలను? అస్మదీయసహోదరులు అవక్రపరాక్రమోపేతులు; అక్షీణశౌర్యతేజోధురీణులు; అస్త్రశస్త్రవిద్యాప్రవీణులు—అటులయ్యు దుర్యోధనుని వలన నీనాఁడీ భయంకరారణ్యమునఁ గందమూలాదులతోఁ బొట్టలు పోషించుకొనుచున్నారు. మత్సరజాడ్యహతబుద్ధియగు దుర్యోధనునిచేఁ గల్పింపఁబడిన మాయాద్యూతమునందు, మేము రాజ్యమోడితిమి. వారు మాసిరులు, సంపదలు, నిధులు నపహరించిరి. ఇఁక మాన ప్రాణములు గూడ నపహరింపనున్నారు. భీమార్జునాదులఁ జంపుటకు దుష్టులెన్నో కుతంత్రములు పన్నుటయు, నిర్హేతుకజాయమాన కరుణాకటాక్షముతో భక్తవత్సలుండగు శ్రీహరి యెప్పటికప్పుడు మాకుఁ జేదోడు వాఁదోడుగాఁ జరించి యాయాపదలం గడపుటయు మీ రెఱింగిన విషయమేకదా! ఓ మహాభాగా! నానానేకసామంతరాజన్యమకుటస్థాపితరత్నదీధితులతో వెలుఁగొందవలసిన యడుగుఁదమ్ములుగల నా యనుఁగుఁదమ్ము లడవులలో నిడుమలుబడుచున్నారు. ఇష్టామృష్టాన్నములతోఁ బరితుష్టిఁబొందినవారు. ఆకలముల నేరికొని తినుచున్నారు. పరిమళప్రద సుగంధద్రవ్యయుక్తములగు పూఁబాన్పులయందు శయనించువా రెండ కెండుచు, వానకుఁ దడియుచు, గాలికి

శోషిల్లుచుఁ గటికిరానేలల మేనులు వ్రాల్చుచున్నారు. ఎండకన్నెఱుంగని సుకుమారగాత్రి ద్రౌపది మాతోఁబాటనవరత వనవాసక్లేశభారమున శుష్కించిపోవుచున్నది. ఆర్యా! మాస్థితిగతులిట్లున్నవి. మేము సుఖమే యనుభవించుచున్నామో, కష్టమేయనుభవించుచున్నామో, మీరే నిర్ణయించి, తెలిసికొనుఁడు. ప్రకృతావస్థ కడుంగడు శోచనీయమనియు మావలె జూదమునం దన్యాయముగా సంపదలెల్లనోడి యడవులపాలయి, దుఃఖముపొందిన రాజు వేఱొకఁడు లేఁడనియు నేను దలంచుచున్నాను". అంత బృహదశ్వుఁడిట్లు వచించెను. "ధర్మనందనా! నీవాక్యములు నాకాశ్చర్యమును గలిగించుచున్నవి. నీవు రాజ్యమును, సిరులను, సంపదలను, భోగములను, భాగ్యములను గోలుపోయితివన్నమాట వాస్తవమేయగును; షడ్రసోపేతభక్ష్యములకు మాఱుగా కందమూలము లారగించుచున్నావన్నమాట వాస్తవమేయగును; చీనిచీనాంబరశ్రేణి వర్జించి, నారలుగట్టుచున్నావన్న మాటయును వాస్తవమేయగును. కాని సూక్ష్మదృష్టితో సత్యము నరసినయెడల నింద్రప్రస్థపురనివాసముకంటె నీయరణ్యవాసమే సౌఖ్యదాయకముగను, వాంఛనీయముగను దోఁచుటలేదా? పుణ్యనదీజలంబులఁ గ్రుంకులిడుచు, భూసురకోటి నర్చించుచుఁ గోగణంబుల సాకుఁచు, దివ్యమహర్షులవలన ధర్మములు గ్రహించుచునున్న నీకు వనవాసక్లేశమెక్కడిది? పూర్వము నీవలె నిడుమలుగుడిచిన పుడమిపతులు లేరనితలంచుచున్నావా? ఆతలంపు సరికాదు. పూర్వరాజన్యులనుభవించిన కష్టములలో నీవును, నీసహోదరులును సహస్రాంశమయిన ననుభవింపలేదనియే చెప్పుచున్నాను. ఏలనందువా? వీరసేనమహారాజునకుఁ గుమారుఁడయిన నలసార్వభౌముఁడు, దిగంతవ్యాప్తయశోవిశాలుండయ్యు, సద్గుణగణాఢ్యుండయ్యు జూదమున సర్వస్వమోడి భార్యయగు గుణములదొంతియయిన దమయంతితో నింతింతన

రాని వంతింజొగెను." అని బృహదశ్వమునీంద్రుఁ డింకను దనమాట ముగింపకముందే, ధర్మరాజాశ్చర్యముతో, "దేవా! వీరసేనతనూభవుండు నలుండు మావలె నిక్కట్టులనుభవించెనా?" యని ప్రశ్నించెను. "ధర్మరాజా! మీవలె నిక్కట్టులనుభవించిన బాగుండెడిది. మీకంటె సహస్రాధికముగా క్లేశమనుభవించెను. చతుస్సముద్రముద్రితంబయిన ధరామండలంబున కధినేతయయ్యుఁ బుష్కరుఁడను వంచకునివలన వంచింపఁబడి కట్టుగుడ్డతోను, భార్యతోను, నట్టడవులకరిగెను. లేక లేక కలిగిన కుమారుని, గొమరితను విడిచిపెట్టెను; భార్యనుగూడ నిద్రాసమయమున విడిచిపుచ్చి, సర్పదష్టుఁడై, సౌందర్యముం బోఁగొట్టుకొని వికృతరూపుఁడై, విదేశమేఁగి వంటవానిగాఁ గుదిరెను. ఆతని చరిత్రము కరుణారసార్ద్రము; పాషాణచిత్తమునయిన ద్రవింపఁజేయఁగలదు; అతిపవిత్రుఁడగు నలుఁడుపొందిన కష్టములముందర మీకష్టములు గణింపఁదగినవికావు". అని బృహదశ్వుండన, ధర్మనందనుం డంజలిఘటించి, "స్వామీ! మహాత్ముల పూతచరిత్రంబులవశ్యగ్రాహ్యములు; శ్రవణానందసంధాయకములు; పాతకహారంబులు; పుణ్యప్రదములు; చిత్తవైకల్యము నడంచుటకును, ధైర్యమును, నిశ్చలత్వమును బొమకొల్పుటకు సహాయకరములు. నలమహారాజెవ్వరు? ఎందువలన భాగ్యభోగ్యములను బోఁగొట్టుకొనెను? ఎవనివలన నేరీతిని వంచింపఁబడెను? తుదకేవిధిని గష్టసాగరమును దరింపఁగలిగెను? సావధానచిత్తుండనై యున్నాఁడను. ఆ పూజ్యుని దివ్యచారిత్రమును సమగ్రముగా వచింపుఁడు". అని వేఁడికొనఁగా బృహదశ్వుఁడు మంగళప్రదమయిన నలచరిత్రము నీక్రింది విధమునఁ జెప్పఁదొడంగిరి.

## — నిషధపుర వర్ణనము —

శ్రీమన్మహీమండలంబునకు మండనాయమానంబైన నిషధరాజ్యము కర్పూరద్వీపంబునకు సమీపంబుననున్నది. నిషధపురమద్దాని

రాజధానీనగరము. అయ్యది భర్మ్యహర్మ్యములతోడను, మహోన్నత సుందరగోపురానీకములతోడను, నిర్మలనీరపూరితకాసారములతోడను, నానావిధ ఫలపుష్పశోభితపాదపబృందాలవాలములగు హృద్యోద్యాన వనములతోడను, సమస్తవస్తుసంచయముల కిరవులగు నంగళ్లతోడను, విశాలములగు వీథులతోడను, అభేద్యములగు దుర్గములతోడను, దుస్తరంబగు నగడ్తతోడను నొప్పుచుండెను. అందచందములచే నయ్యది యమరావతిని హసించుచుండెను; భోగభాగ్యములచే నలకాపురిని గేలిసేయుచుండెను. దానికీడయిన వీడు, ఈరేడులోకములందెందును గానఁబడదు. ఆ పట్టణరాజమున వేదాధ్యయనతత్పరులును, సకలార్థకోవిదులును, నిత్యకర్మానుష్ఠానపరాయణులును, భక్తియుక్తులును నగు బ్రాహ్మణులు — తేజమునందగ్నిని మించి, పరాక్రమమునఁ గుమారస్వామికి వంకలుపెట్టి, నిత్యసత్యసంధతయు, దీనరక్షాపరతంత్రదీక్షాదక్షతయు, యుద్ధమున వెన్నుఁజూపకుండుటయు ననుగుణంబులకు గనులయిన క్షత్రియులు — కుబేరునకుఁ బెట్టుఁబడిపెట్టఁగల ధనికులు వాణిజ్యవిద్యావైశద్యధురీణులు నగు వైశ్యులును, అగ్రజాతుల నచంచల భక్తితో సేవించు విశ్వాసపాత్రులగు శూద్రులును గలరు. అమ్మహానగరమును రాజధానీనగరముగఁ జేసికొని, వీరసేనమహారాజ పుత్త్రుఁడగు నలుండు పాలించుచుండెను. ఆతఁడు కోటిసూర్యప్రభాభాసమానుఁడు; రూపజితమారుఁడు; అశేషశేముషీసంపన్నుఁడు; అసమాన ధార్మికుఁడు; కలనయిన బొంకుట యాతఁడెఱుఁగఁడు; లేదన్నశబ్దమాతని నోటలేదు; శరణన్న శత్త్రువునయినఁ గాపాడుటకు సంశయమరుదు; ఆ మహాత్ముని సద్గుణస్తోమమును దివ్యులకు గురువయిన బృహస్పతిగాని, రాక్షసగురుండయిన శుక్రుండుగాని, వేయిజిహ్వలుగల యనంతుఁడుగాని పొగడఁజాలఁడనుట యత్యుక్తిగాదు. సర్వభూతములను సమదృష్టితో సాఁకుటయన్నను, యాచకుల యభీష్టములీడేర్చుట

యున్నను, మదాంధులగు శత్రువుల నిర్జించుటయన్నను ఆ పూజ్యాన కానక్తిమెండు. ఆతని యేలుబడిలో పుష్కలముగా నన్నవస్త్రాదులకుఁ గొఱతలేదు ; అధర్మము మచ్చునకయినఁ గానఁబడదు ; అవిద్య లేనేలేదు ; క్షామముపేరు జనులెన్నఁడును వినలేదు ; దొంగతనము గాని, జారత్వముగాని ప్రజలెఱుఁగరు. నిత్యసంతుష్టులై, తాము షడ్రసోపేత భక్ష్యాన్నములారగించుచుఁ బరులకు సంతోషముతో వానింబెట్టుచుఁ గులాశ్రమోచిత ధర్మముల నేమరక, దైవభక్తిని, ప్రభుభక్తిని, గురుభక్తిని, మాతృభక్తిని, పితృభక్తిని విడువక, జను లానందసాగరములందుఁ దేలియాడుచుండిరి. దేవతలానగరమును వర్ణిం చుపట్ల సిరికిఁ బుట్టినిల్లనియు, సరస్వతికి విడిదిగృహమనియు, ధర్మదేవ తకు పట్టుఁగొమ్మయనియు వచింతురు. ఇట్లు సర్వవిధములచే బ్రశస్తి గాంచిన నిషధరాజ్యమును పురందరవైభవముతో నలుండేలుచుండెను.

## — గోవ్యాఘ్ర సంవాదము —

నలమహారాజు పరిపాలించుచున్న కాలములో నిషధరాజ్యము నందున్న యొకయడవిలోఁగల యొకనదియొద్ద నొక్కదినమున నీరు త్రావఁగోరి గోవ్యాఘ్రము లరుదెంచినవి. గోవొకయొడ్డునను, వ్యాఘ్రమొకయొడ్డునను నిలువఁబడి నీళ్లు త్రాగుచున్నవి. అప్పట్ల ఆవు తనతోఁక నుత్సాహంబుకొలంది నీటనుంచి విదలింపఁగా, నీటితుంప రులు పులిమీఁదఁ బడినవి. అందులకా శార్దూలవల్లభుఁడు కోపించి, కన్నులెఱ్ఱఁజేసి, “ఏమి! గోవా! నీకింతపొగరా ? హెచ్చుతగ్గులు తెలియుటలేదా ? తోఁకను నీటముంచి మాపై మురికినీటితుంపరలు చల్లుచున్నావా ? నలమహారాజు పాలనమున మేము మీజాతినిఁ జంప వెఱచియుంటచేఁగదా నీకింత నిర్భయము ! కానిమ్ము. కాలమెప్పుడు నొకేరీతియుండదు. ఈ నలుఁడు స్థిరుఁడా ? నిత్యుఁడా ? బ్రహ్మ

కల్పాంత మీదేశమును బాలింపఁగలఁడా ? వీరికి ముందెందఱురాజు లయిరి ? ఇకముందెంతమంది కానున్నవారు ! నలుని యనంతరము మేము మాకుఁగలశక్తిని బ్రకటించి, మిమ్ముల నధింపకుందుమా ? ” అని పరుషములాడెను. ప్రభుదూషణమాలకించి, గోవుసహింపక, “ ఓవ్యాఘ్రరాజామా ! నేను నిన్నుఁ జిన్నఁబుచ్చుటకుఁగాని, అవమానపఱుచుటకుఁగాని, నీపై నీళ్లుచల్లలేదు. ప్రమాదవశమున నీటి తుంపరలు నీపై బడినమాట వాస్తవమే ! అందులకుఁ దప్పిదమొనరించిన నన్ను శిక్షించుటకు మాఱుగా ప్రభుదూషణ మేలచేసితి ” వనెను. పులి యప్పుడయిన స్వయంకృతాపరాధమును దెలిసికొనక, నలమహారాజును దూషించుచుండఁగా నంతరిక్షమార్గమునుండి తృటిలో దివ్యమను శబ్దముతో సుదర్శనమనఁబడు విష్ణుచక్రమేతెంచి, దాని శిరమును భేదించినది. ఆ వింతవృత్తాంతము నాలకించినవారును, ఆవింత దృశ్యమును దిలకించినవారును, నలునకును శ్రీమన్నారాయణునకును భేద మావంతయు లేదనియు, నలునియెడ నపచారమొనరించినవారు నారాయణునియెడ నపచారమొనరించినవారుగా పరిగణింపఁబడుదురనియుఁ దలంచి, నలునియందు భక్తివిశ్వాసములు గలిగి, నీతితప్పక, ప్రవర్తించుచుండిరి.

## — వసంతాగమనము — హంసతోడిమైత్రి. —

రూపజితమారుఁడైయున్న నలుండు యువతీజనమనోహరుండయ్యు నవివాహితుండు. ఆపుడమిఱేఁడు విదర్భ దేశాధీశుఁడయిన భీముని పుత్త్రికారత్నమగు దమయంతి మూర్తీభవించిన సౌందర్యము వలెను, మానవత్వముగైకొన్న రతీదేవివలెను విలసిల్లుచున్నదని కర్ణాకర్ణికగావిని యామెయందు లగ్నమయిన చిత్తముతోనుండెను. అంతలో వసంతమేతెంచెను. ఆఋతురాజము సర్వజనాహ్లాదమనియుఁ

గాముకులపాలిటి కల్పవృక్షమనియు వేలుగఁ జెప్పవలయునా! వసంత ఋతువునందొక శుక్లపక్షదినమున చంద్రుఁడు ప్రశాంతకాంతులీనుచు నాకసంబునఁ దేజరిల్లుచున్న సమయమున రాచనగరియందలి విహారవాటికను నలుఁడు ప్రవేశించెను. ఆయుద్యానవనమున పుష్పములతో నొప్పుచున్న మల్లెలు, మొల్లలు, జాజులు, విరజాజులు మున్నగు వృక్షములనేకములు నేత్రపర్వ మొనరించుచున్నవి. శుకములు, పికములు, శారికలు మున్నగు విహంగము లనేకములు వింతవింత రంగులతో వెలయుచుఁ దీపి కూతలతో నారామమును బ్రతిధ్వనింపఁ జేయుచున్నవి. ఆసమయమున నలుండు చంద్రకాంత శిలావేదికయం దుపవిష్టుఁడై, పక్షుల మధుర రుతంబులను, మొక్కల సౌరును, పూవులతీరును, గంధవహుని సోయగమును గనుఁగొని యానంద మొందుచుండెను. అప్పట్ల దమయంతీ దివ్యస్వరూప మాతనికన్నులకుఁ గట్టినట్లు తోచినది. తోడనే మన్మథవికార ముదయించినది. ఆతఁడు నిజమానసంబున భక్తవత్సలుండగు శ్రీమన్నారాయణుని ధ్యానించుకొని, 'ఓమహాత్మా! నేను నీభక్తుఁడను. నీవు భక్తులపాలిటిపారిజాతమవు. భక్తుల వాంఛితార్థము లీడేర్చుటయే భవదీయకార్యముగదా! భీమరాజ తనూభవయగు దమయంతి సౌందర్యమున నసమానయనియు నామెలావణ్యమద్వితీయమనియుఁ బలువురు చెప్పఁగా వినియున్నాను. బంగారమునకుఁ దావియబ్బినట్లుగా నాయింతి సోయగమునకుఁ దగిన సద్గుణసంపత్తియుఁ గుదిరియున్నదని నాయాస్థానమునకు వచ్చుచుండు మునిజనులు వాకొనఁగా వినియున్నాను. సద్వంశము, సంతానంప్రదాయము, సౌందర్యము, సద్గుణముగల కన్యామణిని ఉచితగతి నర్థించుట దోషము కాదుకదా! శ్రీహరీ! నిర్వ్యాజకృపాలహరీ! నీవు నావాంఛితమున చిరకాలములో నీడేర్పుము—అని, ప్రార్థించి, కనులుమూసి నిద్రించెను. రాత్రియంతయు నాభూజానికి దమయంతీ స్వరూపమే స్వప్న

మున గోచరించెను. తరువాత ప్రాతఃకాలముకాఁగా నామహీజాని నిద్రనుండి మేల్కాంచి, నిత్యకృత్యములు నిర్వర్తించుకొనెను. అంతలో శ్రీమన్నారాయణుని సంకాల్పాను సారమొక యంచలపిండం తరిక్షమార్గమున బోవుచు నాయుద్యానవనమున వ్రాలినది. వర్ణనాతీత సౌందర్యముతో నొప్పుచున్న రాజహంసలస మూహము ఇనుమున యస్కాంతనుట్లు, నలమహారాజుచిత్తము నాకర్షించినది. ఆతఁడా హంసలలో నొకదానిని బట్టుకొనెను. తోడనే తక్కంగల యంచల పిండుమింటికెగసెను. నలుండు దానుగేలఁబట్టినహంసయొక్క పక్ష మార్దవమునకును, అంగములపొందికకును దనలోఁదాను హెచ్చుగా మెచ్చుకొనుచు నొక్కతావునఁగూరుచుండి, తదేక ధ్యానముతో నావి హంగమును దిలకించుచుండెను. అప్పుడా రాజహంస మనుష్య భాష ణంబుల నిట్లనెను. ' ఓనలసార్వభౌమా ! నీవు నీతికోవిదుఁడవు. నీవలె ధర్మములెఱింగినవారును, ఎఱింగిన ధర్మముల నాచరణయందుంచు వారును ఇంతకుముందు జనింపలేదు; ఇప్పుడు జనించుటలేదు; ఇఁక ముందుజనియింపఁబోరు. కలయందయినఁ బ్రాణిహింస చేయనొల్లని నీవు నాకేల బాధకలుగఁ జేసెదవు ; నన్ను మాజాతి పక్షులనుండి వేఱుసేయవలదు. దయయుంచి విడిచిపెట్టుము నా ప్రార్థన మన్నించితి వేని, నీచిత్త వృత్తికి దగినయుపకారమును నే నాచరింతును. నేను సర్వ సక్తిమంతుఁడనుగదా ! నాకీ యల్పజీవి యెట్లుపకరింపగలదని నీవుసంశ యింపవలదు. ఏపని యెవరివలనఁ గాఁదగునో, అది వారివలననే చేయఁ బడవలయును. ప్రస్తుతము నావలన నీకుఁ గాఁదగిన మహోపకార మొందున్నది '' ఆపలుకు లాలకించి నలుండాశ్చర్యమును, హర్షమును జెంది, ' ఓహంస రాజమా ! నీవుసామాన్యపక్షివిగాఁ బొడఁగట్టుట లేదు. నీకు మనుష్యభాషణ మెట్లలవడెను ? నాచిత్త వృత్తికిఁ దగిన యుపకారముఁ జేతుననుచున్నావు. నాచిత్త వృత్తి యెట్టిది ! అయ్యది

నీకెట్లు ఎఱుకపడినది ? వచింపుము. ' అనెను. అంత రాయంచయిట్లని మాఱుపలికెను. " నలసార్వభౌమా ! మేము దివ్యజాతి పక్షులము. పదునాల్గు భువనంబులందును మేముచూడని తావొంవులేదు ; మాకె ఱుకపడని యర్థముండులేదు. మఱియు మేము భూతభవిష్యద్వర్తమాన ములనెఱుంగుదుము. నీచిత్తమిప్పుడు భీమరాజు పుత్త్రియగు దమ యందు హత్తుకొనియున్నది. ఈమాట యథార్థము. ఆమెను బరిణయ మాడుటకు నీవుకుతూహల పడుచున్నావు. ఆకుతూహలము సమంజస మయినది. ఆవాంఛ ప్రశంసాపాత్రమయినది. భూలోక స్వర్గలోక పాతాళలోకము లందెందును దమయంతిని బోలినయింతి వేఱొకతె లేదు. ఆమె సౌందర్యము రంభాద్యప్సరసలకు దర్శనీయము. అకలంక వర్తన మనసూయాది మహా పతివ్రతాంగనలకుఁ జిరస్మరణీయము. ఆమె జనన ప్రకార మెఱింగించుచున్నాను. వినుము.—

— హంస నలునకు దమయంతీ జనన ప్రకార మెఱిఁగించుట —

విదర్భ దేశాధీశుఁడగు భీముఁడు మహాతేజశ్శాలి; అవక్ర పరాక్రమోపేతుడు; మహేంద్ర వైభవాన్వితుఁడు. కాని—సంతాన హీనుఁడు. సంతాన మర్థించి యాయొడయఁ డర్ధాంగితోఁగూడ దాన ములుచేసెను; యజ్ఞము లాచరించెను. వేల్పుల నారాధించెను; కాని సంతుకలుగలేదు. ఆతండొకదినమున సామంతులు, మంత్రులు, పురో హితులు, దండనాథులు, బంధు మిత్త్రాదులు మున్నగు వారందఱును నిండుకొలువులో నుచితాసీనము లలంకరించియుండగా, వారి నవలో కించి యిట్లనెను. " నేను సంతాన హీనుఁడనై యున్నాను. ' అపుత్త్రి స్యగతిర్నాస్తి ' యని వేదములు చెప్పుచున్నవి; వచ్చియు రాని ముద్దు మాటలతోను, తప్పటడుగులతోను సంతోషము గలుగఁజేయు బిడ్డలు లేనిగృహము గృహముకాదు; సంతానములేనివాఁడు యజ్ఞాది పుణ్య

కర్మములు చేసియు, వానిఫలమును బొందఁజాలక పోవుటవలనఁ జేయని వాఁడేయగుచున్నాఁడు. నేనింతదనుక పుత్రార్థి నై పుణ్యము లనేకము లాచరించితిని; వ్రతములు చేసితిని; క్రతువులు చేసితిని; దానము లాచరించితిని; ధర్మములు సల్పితిని; దైవములకు మ్రొక్కితిని. కాని దైవానుగ్రహము కలుగలేదు. ఇఁక నుపేక్షించి, కాలమును వ్యర్థముసేయఁ గూడదు. భార్యతోఁగూడఁ గానకరిగి తపోనిష్ఠ నవలంబింతును. కనుక రాజ్యభారము ప్రధానామాత్యుని భుజాస్కంధమునందునుచుచున్నాఁడను. నేను లోపము లేకుండ మీరందఱు నిప్పటివలెనే యిఁకముందు గూడ మీమీ పనులు శ్రద్ధతోను, విశ్వాసముతోనుచేసి, ప్రజలకు సంతోషము గలుగఁజేయుఁడ" నిచెప్పగా నెల్లరును ప్రభువియోగము సహింపలేక, అశ్రుపూరి తనయనులై, విచారించిరి. తరువాత పురోహిత నిర్దిష్టమగునొక శుభముహూర్తమున భీమరాజు భార్యాతోఁ గూడఁ దపోవనమునకు బయలుదేరెను ; మంత్రి పురోహిత సామంత దండనాథులును, ఉన్నతోద్యోగులును, పుర ప్రముఖులును, ఖేదముతో గూడినచిత్తములతోఁ బ్రభు దంపతులను పురబాహ్య ప్రదేశము వఱకు సాగనంపిరి. అట ప్రభు దంపతులు మున్యుచితవేషములుధరించి, పట్టుపుట్టములు విడిచి, ఆభరణములూడ్చి, తమవెంటవచ్చిన వారినవలోకించి, ఆర్యులారా ! మీరింకఁ దడయవలదు. నగరమునకు మరలిపొండు. ఎంతదూరమని మీరు మావెంటవత్తురు ? మేము చిరకాలములోనే భగవదనుగ్రహముపొందిన, నగరమునకు, దిరిగివత్తుము." అనిచెప్పి వారినూఱడించి, పంపివేసి, తామరణ్యములకుంజనిరి. వారు దుర్గమారణ్యములంబడి పోయిపోయి, యొక్కచోట వాలఖిల్య మహామునీంద్ర తనూభవుఁడయిన, దమనముని పుంగవు నవలోకించి భక్తితాత్పర్యములతో సాష్టాంగ ప్రణామము లాచరించిరి. మహత్తర శక్తియుక్తుండును; అనల్ప తేజుండును ; నిరతిశయ తపోధనుండును నగు

దమనమునీశ్వరుఁడు భీమరాజ దంపతులంగని, "ఓదంపతులారా! మీరెవ్వరు! మీముఖవర్చస్సును జూడఁగా సుక్షత్రియవంశసంజాతులనుట తేటపడుచున్నది. మున్యుచిత వేషముతో నీయడవి కేలవచ్చితిరి?" అనఁగా, భీమరాజేంద్రుఁడు సవినయముగా నామునీంద్రునితో నిట్లనెను. "ఓమహాత్మా! నేను విదర్భదేశము నేలువాఁడను; భీముఁడను పేరఁబరఁగువాఁడను; ఈబిడ నాసహధర్మచారిణి. మాకుఁ దమయనుగ్రహమున సమస్త భాగ్యములున్నవి; భోగములకు గొదువలేదు. కాని, సంతానములేదు. సంతానము లేమిదోషములలో నెల్లదోషమని తమబోటి విజ్ఞులు వచింతురుగదా! తద్దోష నివారణార్థమై ప్రయత్నింపఁగోరి మేమీ యరణ్యముల కీవేషములతో వచ్చితిమి." అనుటతోనే దమనకుండు, ఆరాజ చూడామణియొక్క విఖ్యాతి నాలకించినవాఁడగుటచేత నాతనిఁ గాంచినందుల కత్యంతానందముఁజెంది, "భీమరాజా! నేను వాలఖిల్య పుత్రుఁడను; దమ నకుడను; దిగంత వ్యాప్తయశోఽన్వితుండవగు నిన్నుగుఱించి పలుమారులు నేను వినియున్నాను; నీయాగమనము నాకు సంతోషదాయకమయినది. నీవు సంతానముగదా యభిలషించుచున్నావు! నీకోరికను నేనునెఱవేర్తు" ననెను. ఆమాటలకు భీమరాజ దంపతులు వర్ణనాతీతమగు సంతోషమును బొందిరి. తరువాతఁ గొంతకాలమునఱకు దమనకుని యాశ్రమమునందే యుండి, అమ్మహాత్ముని అగ్గలంబగు భక్తితో సేవింపఁగా నాతండు ప్రసన్నుఁడై, 'ఓదంపతులారా! మీరింక నగరమునకు మరలిపొండు. తొంటి సౌఖ్యము లనుభవింపుఁడు. అచిరకాలములోనే మీకుఁ దమనాభియను కుమారుఁడును, దమయంతియను పుత్రికయును గలుగుదురు. వారివలన మీవంశము సముద్ధరింపఁబడి వన్నెకెక్కును." అనఁగా భీమరాజు చెప్పనలవికానంత సంతోషమును బొంది, మునీంద్రునకు నమస్కరించి, తదాశీస్సులంది, సెలవుపొంది, భార్యతోఁగూడ నగర ప్రవేశ మొన

రించెను. నగరులోని ప్రజలెల్లరును దమ ప్రభు దంపతుల రాకకు హర్షించిరి. అనతికాలములోనే భీమరాజపత్ని గర్భవతి యాయెను; నవమాసములునిండినవెనుక నొకశుభముహూర్తమున నవమన్మథాకారుడగు పుత్రకుని, మూర్తీభవించిన సౌందర్యరాశియగు పుత్రికను బ్రసవించెను. భీమరాజాసమయమున సామంతులకు బిరుదములు, దండనాథులకు పతకములు, మంత్రులకు నూతనాధికారములు, సరదారులకు జాగీరులు, పురోహితుల కగ్రహారములు, పురప్రముఖులకుఁ గానుకలు, భూసురకోటికి భూదాన గోదానాదులు, యాచకుల కభీష్ట ఫలములు నొసంగి, పుత్రోత్సవమును మహావైభవముగా రాజ్యము నందంతటను జేయించెను. తమయేలిక సంతాన వంతుఁడయినందులకుఁ బ్రజలు నూతన వస్త్రాభరణములు ధరించియు, గృహములు సింగారించియు, నిష్టమృష్టాన్నములు భుజించియుఁ దమ సంతోషమును బ్రకటించిరి. మగబిడ్డఁడు తపనాభి యనఁబడెను; ఆడుబిడ్డ దమయంతి యనఁబడెను; అయ్యిరువురును రూపమున నసమానులై యుండిరి. ఓనలరాజేంద్రా! ఆయిరువురిలో దమయంతియందె యెల్లరకు మిక్కిలి మక్కువగలదు. ఆమె ఇప్పుడు దినదినాభివృద్ధి నొందుచున్నది. ఆమెజన్మ ప్రకారమిదియె. నీకెఱిఁగించితిని. ఆమెను నీకెటులయినఁ గూర్తును. నామాటలను విశ్వసింపుము. సంశయాకులచిత్తుఁడవు గావలదు; మాజాతి పక్షులు పలికి బొంకుట యెఱుఁగవు. ” అని రాయంచయనఁగా, నలుఁడానందమొంది యిట్లనెను.

“ ఓరాజహంసమా! నీయందునాకు అవిశ్వాసములేదు; నీసామర్థ్యమును నేను శంకింపను. కాని, నీవుదమయంతికి నా హృదయమును విశదపఱిచి యామె చిత్తవృత్తిని దప్పక నాకెఱిఁగింప వలయునని మాత్రము నిన్ను గట్టిగాఁ గోరుచున్నాను. నీరాకకొఱకు నిరీక్షించుచుందును; విరహ వేదనాదందహ్యమాన మానసుండనగు నాకుఁ జిత్త

శాంతి నీవలనఁ గదా కలుగవలయును ! కాఁబట్టి యీకార్య నిర్వాహ ణముపట్ల నుపేక్ష వహింపఁ దగుదు; ఆలశ్యము సేయఁదగదు; అత్యంత శీఘ్రగతిని శుభవర్తమానముతో రావలయును.” అని పలికి, ప్రేమ పురస్సరముగ దానిఱెక్కలు నిమిరి, ముద్దాడి యంతరిక్షమున విడువఁగా నదియు వాయువేగమునఁ బోవుచు భీమరాజ పాలితంబగు విదర్భకు బయనమయ్యెను

## — దమయంతికడకు రాయభారము —

అట విదర్భదేశమున దినదినాభివృద్ధినొందుచు నల్లారుముద్దుగాఁ బెంపఁబడుచు స్త్రీజనోచితములగు సమస్తలలితకళలయం దపారనైపు ణ్యము గడించి, దర్శనీయసౌందర్యలావణ్యములతోను, శ్లాఘ్యవర్త నముతోను అకలంకగతిని వర్తిల్లుచున్న యాదమయంతి, తన జనకుని యాస్థానమునకేతెంచు మునిజనులవలన నిషధపతియొక్క నలుని గుణ గణ ప్రశంస నాలకించియుండెను ; ఆమెకు యుక్తవయస్సు పైబడినం తనే, సర్వదా నలసార్వభౌముని రూపగుణాదులయం దభిలాషము మెం డయ్యెను ; సురసిద్ధసాధ్యగంధర్వ యక్షకిన్నరకింపురుష గణంబులలోఁ గాని, మర్త్యులలోఁగాని నలునిఁబోలిన యందగాఁడును, తేజశ్శాలియుఁ బరాక్రమవంతుఁడును, కీర్తిమంతుఁడును మఱియొకఁడు లేఁడని యామె తెలిసికొన్నది. అమ్మదవతి యొకనాటి సాయంసమయమునఁ బిల్లగాలు లల్లనల్లన వీచుచుండఁగా రమణీయోద్యానవనంబునఁ జెలులతోఁగూడ విహరించుచుండెను. ఆ సమయంబున నామె మనము నలునియందు లగ్నమైయుండెను ; తుమ్మెదలఁబోలిన కురులతోను, కలువరేకులం బోలిన కన్నులతోను, షోడశకళాప్రపూర్ణమగు చంద్రబింబముం బోలిన మోముతోను, రంభాస్తంభములం బోలిన యూరువులతోను, సైకతశ్రేణులఁబోలిన పిఱుదలతోను, సువర్ణకలశములంబోలిన స్తనము

లతోను దనరుచున్న హంసయానలగు చెలికత్తెలెందఱో ఆమెను బరి వేష్టించియుండి యిష్టాగోష్ఠిజరుపుచుండిరి. అంతలో నొకహంసకదంబము వచ్చి దాపున వ్రాలినది. అందున్న యంచలు మనోనందసంధాయకములై యుండుటచేతఁ గాళ్లయందియలు ఘల్లుఘల్లుమని మ్రోయ హస్తముల ధగధగద్ధాయమానములైన కటకాదుల క్వణక్వణరవము లెసంగఁ గంఠములందలి పచ్చలపతకములు బయటఁబడఁ, గొప్పులు జాఱఁ జెలికత్తెలు పరువెత్తి వానిం బట్టుకొనఁగడఁగిరి. దమయంతియు నింతింతనరాని యుత్సాహముతో నలునికడనుండి వచ్చిన హంసనుబట్టుకొని పూఁబాన్పుపై గూరుచుండి, దాని సోయగము నగ్గించి, ప్రేమపురస్సరముగ దానిఱెక్కలను జేతితోనిమురుచుండఁగా నదిమృదుమధురభాషణంబుల నిట్లనెను. "ఓ గంధగజేంద్రయానా! భీమరాట్పుత్రీ! నేను నీకొఱకే శృంగారంపుఁ బూఁదోఁటయందు నాజాతి పక్షులతోవచ్చి వ్రాలితిని." హంసపలికిన యీపలుకులకు దమయంతి యాశ్చర్యమందెను. ఆమె చెలికత్తెలందఱు విస్మయచిత్తలై, "బాపురే! అమ్మలక్కలారా! ఈ వినోదమును గంటిరే! ఈచిత్రమును మున్నెన్నఁడయినఁ జూచితిరే! ఈపక్షి మనుష్యభాషణంబుల మాటలాడుచున్నది. అంతేకాక, మన దమయంతికొఱకు వచ్చినదఁట! ఏమి చెప్పునో విందము రండు రండ" ని గుమిగూడిరి. దమయంతియు దానిమ్మగింజలం బోలిన చిఱుపండ్లు వెలువరించి, మందహాసాంచిత వదనయై, "ఓ రాజహంసమా! నీపలుకులు విశ్వాసపాత్రములా! నాకొఱకు నీవేలవచ్చితివి? నీవృత్తాంతము వింతను దోఁపఁజేయుచున్నది సత్వరమున వచింపు" మనెను. అపుడు హంస దమయంతి కిట్లు చెప్పుచున్నది. "ఓసౌందర్యరాశీ! నాపలుకులు యదార్థములే యగును; మేము దివ్యజాతిపక్షుల మగుటవలన మాకు మనుష్యభాషణంబు లలవడినవి. నేను నిశ్చయముగా నీకొఱకే వచ్చితిని. నీచిత్త

వృత్తిని గ్రహించితిని. నీ హృదయ మిప్పుడు కామవికారమునకు లోనయి యున్నదికదా ! మదనుఁ డదయుఁడై నిన్నిపుడు కాఱియఁ బెట్టుచున్నాఁడు. మఱియు నీచిత్త మేయుత్తమరాజపుత్త్రునియందు హత్తుకొనియున్నదో నేనెఱుంగుదును." అనఁగా దమయంతి అత్త్ర ముతో, "ఓ విహంగవల్లభా ! నేనువరించిన రాకుమారుఁడెవ్వఁడు ? అతని నామధేయ మెఱిఁగించిన నీసామర్థ్యమునందు నాకు నామ్మకము కుదురఁగలద" నెను. హంస యిట్లని మాఱువలికెను. "ఓ లావణ్య రాశీ ! నీవు నలునిఁ బ్రేమించితివి. నలునియొక్క గుణగణాదులను వినియుంటివి. త్రికరణములచేత నాపుణ్యుని వరించి కామవికారము నకు లోనగుచున్నావు. నీప్రేమ సమంజసమయినది ; నీవాంఛ శ్లాఘా పాత్రమయినది. ఏలనందువా ? వినుము—నలుఁడు సామాన్యరాజ చక్రమునకుఁ జెందినవాఁడుకాఁడు. శ్రీమన్నారాయణ పుత్త్రుఁడయిన మన్మథుఁడయిన రూపమున నాతని కీడుకాఁజాలఁడు ; అతని శౌర్య మనివార్యము ; ధైర్యమచంచలము ; స్థైర్యమద్వితీయము ; సాహస మపారము. నిత్యసత్యవ్రతుఁడును, దీనజనావనదీక్షాదక్షుఁడును, ధర్మై కనిరతుఁడును నగు నామహాత్మునిబోలిన మహీమతి వేఱొకఁడులేఁడు. ఇంద్రుఁడాతనితో వైభవమునఁ దులఁదూఁగలేఁడు ; అగ్ని తేజమున సాటికాఁజాలఁడు ; వరుణుఁడు పరోపకృతిలో వెనుకంజవేయును ; వాయువు అతనికడ మోముువాల్చును ; కుబేరుఁ డాతనికడ ఋణము గైకొనును ; యముఁడు ధర్మోపదేశము పొందును. ఈ విధముగా నష్టదిక్పాలురును గుణములచేతను, సౌజన్యముచేతను, సత్కీర్తిచేతను ఆ నలసార్వభౌమునకు సమానులుగాక, భట్టులంబోలెఁ ద్రికాలముల ములయందుఁ దన్నామసంకీర్తన మొనరించుచుందురు. అతని గుణము లను సరస్వతియు, ననంతుఁడును గలసి పొగడవలెనన్న దివ్యాబ్దములు సహస్రసహస్రములు గావలయును. వేయేల ? ఆతండు విష్ణ్వంశసం

భూతుఁడు. కాకున్నచో, ఆతనిని దూషించినను, ఆతనియెడ నపచారము తలంచినను, విష్ణుచక్రమయిన సుదర్శనాయుధమేల తనకుఁదాన వచ్చి యట్టివారిని శిక్షించును. ఓదమయంతీ! ఈలోకమునఁ గన్యకామణు లుత్తమపురుష ప్రాప్తికొఱకుగదా యనేకములగు వ్రతములాచరించి, పుణ్యతీర్థసంసేవనమొనరించి, దైవముల నర్చించుచున్నారు! అప్పట్టి నట్టి యుత్తమపురుషుఁడు నిన్ను వలచుచున్నాఁడని వినుట నీ మహాభాగ్యముగదా!” హంసపలికిన యీపలుకు లాలించుసరికి దమయంతికి వర్ణనాతీతమగు సంతోషముదయించినది. ఆమె మోమునఁ జిఱునవ్వు మొలకలెత్త నత్యంతకుతూహలముతో నాపక్షిం దిలకించి, “ఓ పక్షిరాజమా! ఆ నలుండు నా ప్రేమపాత్రుఁడని గ్రహించి, నీవు నా యాంతరంగికమిత్రము వైతివి. ఆ నలుని నీవు చెప్పినచొప్పున నేను త్రికరణములచేతను ప్రేమించితిని. అమ్మహాత్ముఁడు నన్నుఁ బ్రేమించుచున్నదియు, లేనిదియు నిపుడు నీవలన నేను వినఁగోరుచున్నాను. నీవు నాకు సహోదరివంటిదానవు. నీకంటె నాకాప్తులెవ్వరును లేరు; ఆ నలునితో సుఖించునదృష్టము నాకు లభింపనినాఁడు, ఈ జీవితము వ్యర్థము; నేను బ్రదుకఁజాలను; త్రిలోకాధిపత్యము వహించిన వజ్రపాణినయిన నేనభిలషింపను; అనవరతమా నలుని ముఖావలోకనభాగ్య మభిలషింతును; ఆ పూజ్యుని పాదరాజీవసంసేవనము వాంఛింతును; ఆతనితోడి నియోగమును దుస్సహముగా భావింతును. ఓహంసరాజమా! నామనసమందా నలుని దివ్యమంగళవిగ్రహ మొక్కటియే నాటుకొనియున్నది; నాచిత్తవృత్తిని నీవు తెలిసికొంటివి. నేను వచించితిని. కాఁబట్టి నన్నను గ్రహింపుము. నాకుపకార మాచరింపుము. మదనుఁడదయుఁడై నాపై విజృంభించుచున్నాఁడని యమ్మహాత్మునికి తెలియింపుము. ఏకాగ్రచిత్తముతో నాతని యాధిపత్యమును గోరుచున్నానని చెప్పుము. నా ప్రేమనుగల రూపున నాతనికిఁ దెలియఁ

జెప్పి, నన్నెట్టులయినఁ జేపట్టునట్లు లోనరింపుము. ఈ కార్యముపట్ల నీ వుపేక్షవహింపక, శ్రద్ధఁబూనవలెను. పరోపకారము దివ్యస్వభావము. నీవు దివ్యజాతిపక్షివి. కాఁబట్టి నా కుపకృతిని సలుపుము ". అని వేఁడుకొన్నది. హంసయు వరునకుఁదగిన వధువు లభ్యమగుచున్నదనియు నట్టి పుణ్యపురుషునకును, ఉత్తమకన్యారత్నమునకును దాను దూతకార్యము నెఱపుచున్నాననియుఁ దలంచి యమితముగా హర్షించి, దమయంతి కభయమిచ్చి యామెకడ సెలవుఁబుచ్చుకొని, నలునిఁ గనుఁగొన నిషధపురమునకు బయలుదేరెను.

—హంస దమయంతి చిత్తవృత్తిని నలుని కెఱిఁగించుట.—

అట నిషధపురంబున నలసార్వభౌముండు మన్మథబాధ నానాటికి గాటమగుచుండుటచేత ననుదినమును సాయంసమయములం దుద్యానవనమునఁగల సరోవరముయొక్క చంద్రకాంతశిలానిర్మితమగు సోపానంబున నాసీనుఁడై యుండి, " అయ్యో! ఆనాఁడా రాజహంసము దమయంతీ చిత్తవృత్తిం దెలిసికొనుటకును, మామక హృదయానురాగము నామె కెఱిఁగించుటకును, విదర్భకరిగినది. కాని యింకను రాకున్నదే! ఈతడవున కేమికారణము! అయ్యది దివ్యజాతివిహంగరత్న మగుటవలనఁ గల్లలాడదు. తప్పక విదర్భకరిగియే యుండును. కాని యొకవేళ మార్గమధ్యమందున్న కాసారజలంబులందు తనజాతి పక్షులతోఁగలిసి క్రీడించుచు నీకార్యముమాట మరచినదేమో! లేక, అట దమయంతి వేఱొక రాకుమారు నెవ్వనినయిన వలచియుంటచే నావ్యతిరిక్తభావమును నాకెఱిఁగింపఁదగదని రా మానెనో!" అని మనమున వివిధములగు నాలోచనములకుఁ దావొసంగి వ్యాకులమందుచు మింట దృష్టిని బ్రసరింపఁగా నొక్కయంచలపిండు లోచనగోచరమయ్యెను. దానినిజూచి, " అహో! ఏమి! నాపూర్వపుణ్యవిశే

షము ! వెదుకఁబోయిన తీఁగ కాలికిఁ దగిలినట్లయినది. ఆ హంసల పిండు వచ్చుచున్నది. అందు నాయాంతరంగికపక్షి యుండితీరును. అయ్యది విదర్భనుండియే వచ్చుచుండును. తప్పక దమయంతి కడ నుండియే వచ్చుచుండును. దమయంతి నా ప్రేమ నంగీకరించియుండ వచ్చును. అనతికాలములో నేను శుభవార్తనే విననున్నాఁడను." అని, నలుం డనుకొనుచుండఁగా విదర్భలో బయలుదేరిన రాజహంస వచ్చి, తనయుత్సాహమును లబ్ధవిజయమును దెలుపుచు, "జయము. జయము. సార్వభౌమా !" అనెను. అంత నలుండు సాదరముగ దానిని జేరఁదీసి, మందహాసాంచితవదనుఁడై, సంభ్రమముతో నిట్లని ప్రశ్నించెను. "ఓ రాజహంసమా ! నీవు పోయిన కార్యమేమయినది ? విజయమునుబొంది వచ్చినట్లు నీచేష్టలు బోధించుచున్నవి. అమ్మదవతి దమయంతి యేమన్నది ? ఆమె నన్నుఁ బ్రేమించుచున్నదా ? నన్నుఁ జేపట్టుట కంగీకరించుచున్నదా ? మఱియు నక్కన్యకామణియొక్క చక్కదనమును కన్నులారఁ దిలకించితివిగదా ! ఎట్లున్నది ? చెప్పుము." అని యీప్రకారము ప్రశ్నపరంపరలు గురియింపఁగా హంస చెప్పు చున్నది. "ఓ సార్వభౌమా ! నేను భీమరాట్పుత్రియయిన దమ యంతిని శృంగారంపుఁ బూఁదోటలోఁ గనుఁగొంటిని. ఆమె చిత్తము మన్మథాయత్తమైయున్నది. ఆమె తనతండ్రి యాస్థానమునకు వచ్చు చుండు మునిజనులవలనఁ ద్వదీయరూపగుణాభివర్ణనము కర్ణపేయముగ నాలకించి, త్రికరణములచేత నిన్నుఁ బ్రేమించుచున్నది. నీ దివ్యమం గళవిగ్రహావలోకనమునకుఁ దొందరపడుచున్నది ; నీ పాదారవింద సంసేవనార్థము వేగిరపడుచున్నది ; నీ యనుగ్రహము కొఱకుఁ బ్రతి దినము వేయిమంది వేల్పులకు మ్రొక్కుచున్నది. నీకంటెఁ బరదైవ తము లేనట్లు భావించుచున్నది. నన్ను నీయొద్దనుండి పంపఁబడిన దూతగా నెఱింగినంతనే యింతింతనరాని సంతోషముం జెందినది ;

తొలుఁదొల్త నామె చిత్తవృత్తి నరసితిని; మనోగతాభిప్రాయమును దెలిసికొంటిని. పిమ్మట నీవలపునుగల రూపునఁ జిత్రించితిని. నల సార్వభౌమా! ఈ నుడి నాలకింపుము. విధాత తన రచనానైపుణ్యమును బ్రదర్శించుకొనుటకుఁ గాఁబోలును పురుషులలో నిన్నును, స్త్రీలలో నామెను సృజియించియున్నాఁడు. సర్వవిధములచేతను నీవామెకుఁ దగియున్నవాఁడవు. ఆమె నీకుఁ దగియున్నది. మీ యిరువురి సంయోగము లోకకల్యాణప్రదము. అన్యోన్యానురాగపాశబద్ధులగు మీ రుభయులును దంపతులగుట తథ్యము. ఆ దమయంతియొక్క సౌందర్యమును కన్నులారఁగాంచితిని; కాని పొగడుటకు నాకు శక్తి చాలదు. వేయిజిహ్వలుగల యాదిశేషుఁడే యక్కార్యమున కసమర్థుఁడన్న నేనెంతదానను? ఓ రాజేంద్రా! చంద్రబింబమువలె నాయింతి ముఖము ప్రశాంతికాంతిమంతమే; కాని చంద్రబింబమునకున్న కళంకమమాత్రము దానికి లేదు. ఆమె నేత్రములు కలువరేకులవలె విశాలములు; సుదీర్ఘములు; కాని వానికా కన్నులయందలి దివ్యకాంతి పుంజము లేదు; నాసిక సంపంగవలె నతిమనోజ్ఞము; దంతములు దర్శనీయధావల్య ప్రభాభాసితములు; అధరము దొండపండువలెనున్నది; కాని దొండపండున కందలి యమృతరసము లేదు; స్తనములు సువర్ణకలశములు; మధ్యము సింహమధ్యము; పిఱుందలిసుకతిన్నెలు; తొడలు అరఁటిబోదెలు; పాదములు చిగురుటాకులవలె నతిమార్దవములు. వేయేల? రంభ, ఊర్వశి, మేనకమున్నగు నప్సరసప్రముఖు లామెకడ సూర్యునిముందర నాముదపుదీపమువలెఁ గళావిహీనలై పొడఁగట్టుచుందురు. అంత చక్కనిచుక్క భూతభవిష్యద్వర్తమానములఁ గాంచము. ఆమె రూపమునకుఁ దగినవిద్యయును, విద్యకుచితమయిన వినయమును, వినయమున కర్హమయిన సౌజన్యమును గలిగియున్నది. మహాసాధ్వీమతల్లుల మూర్ధమందుండఁదగిన సాధ్వీమణి

యామె. సర్వవిధములచేతను నీకుఁదగియుంశి నిన్నే వరించుచున్న యా సుందరాంగిని నీవు సత్వరంబునఁ బరిణయమాడి సుఖింపుము. మారునితూపుల నామె చూపులతో నిరోధింపుము. ఆమెనుగూడి విజృంభించుచున్న మదనుని గర్వము సర్వము హరింపుము. నీ వాలస్య మొనరించినను, నిరసించినను, ఆయింతి బ్రదుకఁజాలదు—మనస్సు నీయందర్పించి, సర్వకాల సర్వావస్థలయందును నిన్నే ధ్యానించుచున్న యా కాంతిమణిని నీ వొల్లకున్నఁ బ్రాణత్యాగ మొనరింపఁగలదు. కాఁబట్టి వేగిరింపుము. ఆలసింపఁజనదు. అచిరకాలంబులోనే విదర్భ కరుగుము". అనిచెప్పి, యా నలచక్రవర్తియొక్క సన్మానమును బొంది, సెలవుంగైకొని స్వజాతిపక్షులతో నంతరిక్షమునకెగసి యిచ్చ వచ్చినమచ్చునఁ బోయెను.

## — నలదమయంతుల విరహవేదన —

రాజహంసమును వీడ్కొలిపి, నలుండు శయనాగారముం బ్రవేశించెను; కాని యాతనికంటికి నిద్ర రాకుండెను; దమయంతియే యెందుఁజూచిన తోఁచుచుండెను; దేహమున కాక జనించెను. స్వేద బిందువులు కాల్వలై ప్రవహింపఁ జొచ్చెను; హృదయమునందా వేదన యంతకంత కతిశయించుచుండెను; ఎటులో, కన్నులుమూయఁగా మన్మథుఁడేతెంచి, దమయంతీ సాంగత్యార్థమై సత్వరముగా పొమ్మని చెప్పినట్లాతనికి స్వప్నము వచ్చెను. తరువాత నమ్మహారాజు చిత్తము సమగ్రముగా మన్మథాయత్తమయినది ; రాజకీయములందు మనసు పోవుటలేదు; ఆహార పదార్థములయం దభిలాషలేదు. కంటినిండ నిద్ర రాదు. ఇట్లు మారపీడకులోనయి, ' మదనుని గర్వమడంగునట్లు, మనసులోనివాంఛ లెల్లఁ దీరునట్లు దమయంతి యొక్క చూపులతోచూపుల నెట్లు కలుపగలను; ఆమె మోమున మోమును, అక్కున నక్కునుజేర్చి

యధరామృతమాని, కుచములు మర్దించి మరునాలము నెపుడు చేయఁ గలను; అట్టిభాగ్యము నాకెపుడు లభింపఁగలదు ?" అని పరిపరివిధముల దలపోయుచు నిమేషమొక్క యుగముగాఁ గడుపుచుండెను. అట విదర్భలోనున్న దమయంతియు, హంస, త్రికరణములచేతను నలుఁడు దన్నుఁ బ్రేమించుచున్నాఁడని విన్నదిమొదలు కోరికలీరికలెత్తనుత్సాహమినుమడింప మదనసంతాపమును బొందుచుండెను. పడకటింటియందును, భోజన మందిరమునందును, విహార వాటికయందును, ఆమెకు నలుని రూపమొండే గోచరించుచున్నది. పూలు తురుమువారును, గంధము పూయువారును, జడలు వేయువారును, తిలకము దిద్దువారును, అలంకరణము లుంచువారును, చెలికత్తెలవలెఁ గనఁబడుటలేదు. ఆమె నోట నలసార్వభౌముని పూతనామాక్షరోచ్చారణతప్ప నితరములగు నక్షరములు వెలువడుటలేదు. చెలులు షడ్రసోపేత భక్ష్యములను దెచ్చి మ్రోలనిడఁగా పలకదు ; నూతన మనోజ్ఞాభరణములను గన్నెత్తి చూడదు ; ఎవ్వరేమన్నను మాటాడదు ; ఒకరు పిలిచిన వేరొకరిదెస మోముంచును ; వేఱొకరు పలకరించిన నింకొకరితో మాటలాడును; పట్టపవలు కలవరించును. మంచిగంధపుఁ బూఁత మండుచున్నదనును; పూవులు రోఁతను గలిగించుచున్నవనుచు ; పున్నమ వెన్నెలను బ్రచండమగు నెండగాఁ దలంచును ; పూఁబాన్పునఁ దనువుఁ జేర్చకుండును; అలంకరణముల నావలఁబెట్టును ; నెయ్యంపుఁజిలుకకు మాటలు నేర్పుట మానును ; బంధువుల నాదరింపమరచును ; చిత్తచాంచల్యము గలిగినచందమున క్షణమునకు నవ్వును ; మరియొక క్షణమున కుస్సురనును ; వేఱొకక్షణమునకు లేచి నిలువఁబడును ; ఇంకొకక్షణమునకు గూరుచుండును ; ఒక్కచోట ననుస్థిరముగానుండదు. చంద్రునిజూచి నపుడు "చంద్రా ! మిట్టిపడవలదు. నాప్రియునిమోము నీకంటెఁజక్కనయినదిసుమీ ! " యనును. మన్మథు నుద్దేశించి, "మారుఁడా !

నీకింత గర్వమేల ! దగ్ధదేహుఁడవయిన నీకేయింత శ్వాతిశయము న్నదో, నాప్రియునకెంత యుండవలయును ; చలచిత్తయగులక్ష్మికిఁ బుట్టి నచల చిత్తుఁడవీవు సద్వంశ రహితుఁడవుగదా ! పంకయుక్తమగుపద్మము నీతల్లి తల్లి ; అందువలనఁ దత్సంపర్క మెక్కుడికిపోవును ; ఆమలినము నీచిత్తమునందున్నదికదా ! యనును, చెలులందఱును ఆమెలో బొడ సూపిన మార్పులను దెలిసికొని, తమలోఁ దామాశ్చర్యమునొంది వింతవింతగా చెప్పుకొనఁ దొడంగిరి. ' ఓమదనికా ! మన దమయంతికిఁ జిత్తభ్రమణ మొదవినదా !' యని యొక్కసుందరి ప్రశ్నింపఁగా ' రదనికా ! చిత్తభ్రమణముకాదే, నలునియందలి గాఢానురాగమే ! నాఁడు వచ్చిన రాయంచ రాయంచకాదే ! ఆనలుండే యారూపమున వచ్చియుండనోపునే !' యని మఱియొక్క వాల్గంటి ప్రత్యుత్తర మిచ్చెను. ఈప్రకారము చెలులందఱును ఆమె విరహావేదనను బరిపరి విధములఁ జెప్పికొనుచు నానాఁటి కామెచర్య దుస్సహముకాఁగా నిఁకను పేక్షింపఁ దగదని ప్రభుదంపతుల కావృత్తాంత మెఱిఁగింపఁగోరి యంతిపురియందు భీమరాజు భార్యతో నిష్టాగోష్ఠి సలుచున్న సమయము నందుఁ దమరాక నెఱిఁగించి యనుజ్ఞబడసి సమ్ముఖంబునకరిగి ప్రక్క కొదిగి నిలువంబడి, చేతులుమోడ్చి యిట్లనిరి. ' ఓ ప్రభూ ! ఓప్రభ్వీ ! మాచెలియగు దమయంతి కొలఁది దినములనుండి వింతగా ప్రవర్తించు చుండుట మీరు ప్రాయశః కనిపెట్టియేయుందురు. ఆమె యాహార నిద్రా పానీయముల నంగీకరించుటలేదు ; నృత్య గీతాదులు నరయుట లేదు ; జలక్రీడల సలుపుటలేదు. దేనియందు ననురక్తి జూపుటలేదు. ఇందులకుఁగల గోప్యకారణము నెఱిఁగించుచున్నాము వినుఁడు. ఈమధ్య కొన్నిదినములకుఁ బూర్వమొకనాఁటి సాయం సమయమున నంతరిక్షమునుండి యొక అంచలపిండువచ్చి విహార వాటికలో వ్రాలినది. అందుమురిపెముగూర్చు రాజహంస నొకదానిని మాచెలి దమయంతి

పట్టుకొన్నది. తోడనే అయ్యది మనుష్య భాషణంబుల నిట్లన్నది. ' ఓదమయంతీ! నేను నిషదేశ్వరుండయిన నలుని కడనుండి వచ్చి యున్నాను; అమ్మహీజానినీయందు గాఢానురక్తుండై యున్నవాఁడు. ' అనఁగా నామాటలాలకించి మాచెలియ మందానందమంది తనయభిప్రాయమును వెల్లడించినది. దానిం బట్టిచూడగా నామె నలునియందు బద్ధానురాగయై యుండుట ద్యోతకమగుచున్నది. ఆమె తన్మూలమున మన్మథ వికారమునకు లోనయి. పరితాపమును బొందుచున్నది. ఓమహారాజా! మీరింక నశ్రద్ధ వహింపఁదగదు. ఆమె చిత్తవృత్తిని మీకు విన్నవించితిమి గనుక చెట్టులయిన నలసార్వభౌము నామెకు భర్తగాఁ జేయుఁడు; దమయంతికి నిమేష మొకయుగముగా నున్నది. విరహవేదన నానాటికిఁ దీవ్రమై దుస్సహమగుచున్నది. ఆమె శుష్కించిపోవుచున్నది. కాఁబట్టి తోడనే దమయంతీ స్వయంవర మహోత్సవమును జాటఁబంచుఁడు. అనగా భీమరాజు నలుని ప్రశస్తి నాలకించినవాఁడగుట వలన దేవాంశ సంభూతుఁడగు వానిని దన పుత్రికారత్నము ప్రేమించుచున్నందుల కెంతయుసంతసించి, భార్యాతో నాలోచించి, వెంటనే స్వయంవర మహోత్సవ ప్రకటనము సేయఁ దలంచెను.

## — దమయంతీ స్వయంవర మహోత్సవ ప్రకటనము. —

విదర్భ దేశాధీశుఁడు సమ్మట పురోహితామాత్యులను రావించి స్వయంవర మహోత్సవోచితమయిన శుభముహూర్తమును నిర్ణయింపఁ జేసి, ఆహ్వాన పత్రికలు వ్రాయించి, వానిని మంగళ వాద్యములతోనే బదియారు దివ్య దంతావళములందునుచి, అంగవంగ కళింగ కాశ్మీర ఘూర్జర కురుకేకయ గౌళ కొంకణ కెంకణ కొల్ల కోసల కన్నడ కంజ కాంభోజ కిరాత గాంధారారుణావంతీ యాధ్రి వాటయశినాంధ్ర సావీర శాల్మల సింగ సిందుశీన శూరసేన చోళశౌనక ద్రవిడ తుళువ నిషధ నేపాళ పాంచాల శత్రుపాండియ పుళింద ప్రోడ మగధ మత్స్య మరాట

మళయాళ ప్రభృతములగు దేశములను బాలించు నుత్తమరాజ పుత్రులకుఁ బంపించెను. ఆయా దేశాధీశులును దమయంతియొక్క సౌందర్య సౌశీల్యాదులుగూర్చి వినియుండుటచేత నామెను బరిణయమాడుతలంపుతో సముచిత వేషంబులుతోను, మహావైభవముతోను, విదర్భకరుదెంచిరి. విదర్భయు సర్వవిధముల నలంకరింపఁబడి కనుల పండువొనరించుచుండెను; ఆనగరామణీయకతను వర్ణించుటకు ఆదిశేషుని సహస్రజిహ్వలు చాలవు; దానిని తిలకించి తృప్తిపొందుట కింద్రుని సహస్రనేత్రములు సరిపడవు. నిషధాధిపతి నలుండును ఆహ్వాన పత్రికనందుకొని యుచితగతిని విదర్భకుఁ బయనముగానుండెను. అంత బ్రహ్మమానస పుత్రుఁడును, కలహభోజన ప్రయోజన విశారదుండును నగు నారదుండు భూలోకమునం దఖండవైభవముగా వరప్రసాద సంజనితయగు భీమరాట్పుత్రికి స్వయంవరము జరుగనున్నదనియు నామె త్రికరణముఃచేతను గీర్తిశాలియగు నలసార్వభౌముని వరించియున్నదనియుఁ దెలిసికొని, యప్పట్ల దిక్పతులఁ బరాభవించి తనకుఁగల యంగద నడంగఁజేసికొనఁదలంచి స్వర్గమునకు బయలుదేరెను. అమరావతీ నగరమునఁ జింతామణీభద్రసింహాసనంబున నాసీనుఁడై రంభాద్యప్సరసాంగనల నృత్య గీతాదులచే నాకర్షింపఁబడుచున్న దేవేంద్రుని జేరఁబోయి ప్రణామములందుకొని, యుచితాసనంబున సుఖోపవిష్టుఁడై యిట్లనెను.

" ఓనాగలోక సార్వభౌమా! భూలోకమునందలి వింతలేమని నీవు నన్ను సామాన్యముగా నడుగుచుందువుగదా! వింతలలోనెల్ల వింతయగు విషయమును జెప్పుచున్నాను; వినుము. విదర్భ దేశాధిపతియగు భీమునకు దమనకానుగ్రహంబున నొకపుత్రిక జనించినది. ఆమెపేరు దమయంతి. ఆమె సౌందర్య మద్వితీయము. నీవు స్వర్గమునందప్సరసాంగనల నెందఱినో కాంచియుందువు; కాని యట్టి నారీరత్నమును మాత్రము చూడలేవు. సౌందర్యవతులని ప్రసిద్ధిగన్న దివ్య

కాంతలామె కాలిగోరునగోటితోఁ బోలఁదగరనుట యత్యుక్తి కాదు. ఆలావణ్యరాశికిఁ దండ్రి స్వయంవర మహోత్సవమును ప్రకటించి యేఁబదియాఱు దేశములనేలు ప్రభువుల కాహ్వాన పత్రికలు పంపియున్నాఁడు. కాని యామానినీమణి నిషధ దేశాధీశుండగు నలునిఁ బ్రేమించినది ; నలుండును ఆమెయందు బద్ధానురాగియై యున్నవాఁడు. నీవెటులయిన నామెస్వయంవరమునకేఁగి యామెను బరిణయంబాడఁగలిగినయెడల నీత్రిలోకాధిపత్యము వాసిఁగాంచును ; నీవుపొందుసౌఖ్యము సార్థకమగును ;" అనెను. ఆవాక్యములు శచీవల్లభుని హృదయమున నాశాంకురముల లేచఁదీయఁగా నాతఁడు, "నారదముని చంద్రమా ! చక్కని విషయమెఱిఁగించి హెచ్చరించితిరి ; ఆదమయంతిని నేను దప్పక పరిణయమాడి తీరెదను." అని యాతనిని బంపివైచి తత్‌క్షణమే అగ్ని వరుణుఁడు, యముఁడు, అను దిక్పాలురతోఁగూడ నుచితవేష ధారణమొనరించి, దివ్యవిమానంబెక్కి నిషధపురికేతెంచిరి.

— ఇంద్రాదులు నలుని దమయంతికడకుఁ బంపుట. —

నిషధపురిలో నలుండును విదర్భదేశమునకు బయలుదేఱు తలంపుతో నుత్తమాశ్వంబులఁబూన్చిన కనకస్యందనమును, గజాశ్వాందోళికాదులను, మంత్రి పురోహిత సామంతదండనాథ వందిమాగధ పుర ప్రముఖాదులను, మంగళవాద్యములను వెంటనిడుకొనెను. ఆ సమయమున నింద్రాగ్ని యమవరుణులు నల్వురును నలుని కొలువున కరిగిరి. అమ్మహాత్ముల నవలోకించినంతనే, హర్షంబుతో నుప్పొంగి, నలుండు, వారికి సాష్టాంగప్రణామము లాచరించెను ; హేమపీఠములందుఁ గూరుచుండఁ బ్రార్థించి యంజలిఘటించి, "ఇంద్రాగ్ని యమవరుణులారా ! లోకశుభంకరులగు మీరాకవలన మదీయగృహంబు పావనంబయినది ; మీదర్శనంబువలన నేను ధన్యుఁడనయితిని ; మీరు నాయఁ

దనుగ్రహించి విచ్చేయుటకుఁ గారణమేదియో యుండకపోవునా? మహాత్ములు మాదృశులకడ కకారణముగ నెప్పుడును రారుగదా! సంశయింపక మీావచ్చిన పనినిగూర్చి యెఱిఁగింపుఁడు. అదెట్టిదయినఁ గావచ్చును. శిరసావహించి నిర్వహింతును." అనెను. అనఁగా దిక్పతులు సంతసించిరి. పాకశాసనుండిట్లనెను. "ఓ నలసార్వభౌమా! నీవు సాటిరాజులవంటివాఁడవుగావు. అకలంక ప్రవర్తనుఁడవు; నిత్యసత్యసంధుఁడవు; ధర్మైకపరుఁడవు; త్యాగశీలుఁడవు; సూర్యచంద్రాదిగ్రహసంచయంబు గతులు దప్పినను, మహాసముద్రము లింకిపోయినను, మేరుపర్వతము తలక్రిందయినను, నీవన్నమాటను దాఁటవు. నీసామర్థ్యము లోకవిదితము; నీసౌజన్యమమరసంస్తుత్యము. నీవు శ్రీమన్నారాయణాంశ సంభూతుఁడవు; మాకు సముఁడవుమాత్రమేకాక, మాకంటె నధికుఁడవుగూడ నగుదువు. ఓశూరసేనపుత్త్రా! నీవల మేమొక యుపకారమును బొందఁగోరి వచ్చితిమి. మాటుమాటాడక, అకార్యము నీవు నెరవేర్చవలయును." నలుండిట్లు బదులుచెప్పెను. "అమరాధిపా! సందేహమువలదు; నేను మీాదాసుఁడను; మీాకు నావలనఁ గావలసిన యర్థము గైకొనుఁడు; నావలన ముగియవలసిన పనిని జేయించుకొనుఁడు; నేనాడిదాఁటను; త్రిలోకాధిపత్యము వహించి దేవాధీశులకుపకారముసేయుటకంటెను నాకుఁ గావలసినదేమున్నది? అంతటి మహాభాగ్య మబ్బుటకు పూర్వజన్మమున నేనెట్టి సుకృతము నాచరించితినోగదా!" ఆపలుకులాలకించిన పిమ్మట దిక్పతులు సంతుష్టిఁబొందిరి. నలుండు సత్యసంధుఁడగుటవలనఁ దప్పక తమ చెప్పినచొప్పున వర్తింపఁగలడని యనుకొనిరి. అంత నింద్రుఁడు నలునితో నిట్లనెను. "ఓనలసార్వభౌమా! విదర్భరాజయిన భీముని పుత్త్రి దమయంతికి స్వయంవరమహోత్సవము జరుగనున్నదఁట! ఆమె జగన్మోహినియని యుఁ ద్రిలోకైకసుందరియనియు మేము వినియున్నాము. ఆమెను బెం

ప్లాడఁగోరి వచ్చినాము_మానలువురిలో నేయొక్క_నినయున నామెవరిం చునట్లుగా నీవు మావై భవవిశేషాదులనుఁ రూపగుణాదులను, శక్తి సామర్థ్యములను అభివర్ణించి చెప్పవలయును_నీవలన నీయుపకారము జరుగఁగలదని యాశించి, విశ్వసించి నీయొద్దకు వచ్చినారము ; కాబట్టి మాయభీష్టముల నీడేర్పవలెను.” నలుఁడీ మాటలాలకించి విస్మయ చకితుఁడాయెను ; తన్నుదాను నమ్మలేకపోయెను. అవి పలుకులుగాక ములుకులై యాతని బాధింపఁజొచ్చెను. కాని యింద్రాదులు తనచిత్త వృత్తి నెఱుంగుట కట్లు పరిహాసమునకు నుడువుచున్నారేమో యనుకొని వారినుద్దేశించి, “మహాత్ములారా ! ఇవి యేటిమాటలు ? ధర్మాత్ములు, సర్వజ్ఞులునగు మీకుఁ జెప్పవలసిన విషయమేమున్నది ? మీరు నుడివిన రీతిని దమయంతి లోకైకసుందరియగుట నిశ్చయమే ! ఆమెను త్రిక రణశుద్ధిగా నేను ప్రేమించి పరిణయమాడఁ గోరుచున్నాను. ఆమె స్వయంవరమున కిపుడు బయలుదేరనున్నాను. అదియునుగాక, ఆమె చిత్తము నాయందు హత్తుకొని యున్నదని నేనాలకించియున్నాను; మేముభయులము పరస్పరము ప్రేమించుకొనుచుండఁగా, మాప్రేమకు మీరేల యంతరాయము గల్పింతురు ? మఱియుఁ గేవలము మదీయాభి ప్రాయమెట్టిదో పరీక్షించుటకుఁగాకున్న మీకు మానవకన్యయెందులకు? దిక్పతులరగు మీరే యభిలషించినవాఁడు, మిమ్ము వరించు దివ్యకాంత లెందఱులేరు ? ఆర్యులారా ! మీకు సహస్ర ప్రణామము లాచరించు చున్నాను. నాతోఁ బరిహాసమాడక, నన్ననుగ్రహింపుఁడు.” అంత నింద్రుఁడిట్లనెను. “ నలమహీపతీ ! మేము నీతోఁ బరిహాసమాడుచుం డుటలేదు_యదార్థమే వచించుచున్నాము_ఆదమయంతిని మాలో నొక్కరు పరిణయమాడవలెనని యాశించుచున్నాము. మాయాశ నీవలన సఫలీకృతము కాఁగలదనియుఁ దలంచినాము. అట్టిచో నీవన్యథా వచింపకుము.” నలుండు దేవేంద్రుని వాక్యములు పరిహాసపాత్రములు

కావనియు నాతఁడు సత్యమునే వచించుచున్నాఁడనియుఁ దెలిసికొని, మిక్కిలియుఁ బరితాపమొంది, డగ్గుత్తికతో నిట్లు మాఱువలికెను. "ఓ నిలెంపాధపా! నేను దమయంతిని గామించి యామె స్వయంవరము నకుఁ బోవనుండ మీరిట్లుకోరుట న్యాయమా? తానువలచిన కాంతను, దన్నువలచిన కాంతను బరపురుషుని కొప్పగించు పాపాత్ముఁడెందయినఁ గలఁడా? నావలనఁ గాదగిన కార్యమేదయిన నానతిండు; శిరసా వహించి, నిర్వహించి మీకు సంతోషముగూర్చి నేను సంతోషింతును. కాని యిట్టి సందర్భమున నన్ను అనుగ్రహింపుఁడు. మిమ్ములను బెం డ్లాడుమని నేనామెతో నోగెత్తి చెప్పజాలను." అనఁగా దేవేంద్రుఁ డిట్లనెను. "ఓనలసార్వభౌమా! నీవు ధర్మవిదుండవనియుఁబలికి బొం కనివాఁడవనియుఁ బ్రఖ్యాతినార్జించితివి. శరీరము స్థిరముకాదు; ప్రాణ ము నేఁడుగాకున్న రేపయినను మృత్యుగర్భమున లీనము గానలసినదే! కీర్తి యొక్కటియే సుస్థిరమయినది; కలంకరహితమయినది. నీవు దేహా భిమానముచేత నిత్యము, నిర్మలమునగు కీర్తిని బోఁగొట్టుకొందువా, పలువురచేఁ జులకనసేయఁబడుదువు. నీయందుఁగల యాధిక్యత యంత రించును; సామాన్యమానవులలో నీవొకఁడవగుదువు. దాతయగు వాఁ డిచ్చెదనన్న యర్థమును, ఎట్టిదయినను ముందువెన్క లరయక యిచ్చి యేతీరవలయును. నిత్యసత్యవ్రతుఁడగువాఁడు, అన్నమాటను భూత భవిష్యద్వర్తమానకాలములం దేమివాటిల్లినను, నిస్సందేహముగ నెఱ వేర్చియే తీరవలయును. నీవు సర్వశాస్త్రపారంగతుఁడవు. శ్రీమన్నారా యణునివలె సర్వజ్ఞుండవు. నీకు మేము చెప్పవలసిన యర్థముగాని, బోధింపవలసిన నీతిగాని, ఎఱిఁగింపవలసిన ధర్మసూక్ష్మముగానిలేదు. దమయంతియందలి మోహముచే నీవు మాకార్యమును జేయమానితి వేని, అనృతదోషము నీకు వాటిల్లఁగలదు; అపకీర్తి నిన్ను ఆజన్మాం తము బాధింపఁగలదు. బాగుగా నాలోచించుకొనుము. తొలుతమాకు

బాస చేసితివి. దాని నిప్పుడు కాదనుటయుక్తముగాదు. నలుఁడా వజ్రపాణి పలుకుల నాలకించి వ్యాకులచిత్తుఁడాయెను; మాఱుమాటాడఁజాలకపోయెను. తద్దయుంబెద్దప్రొద్దు కర్తవ్యనిశ్చయముకొఱకుఁ బాటుపడెను; చివరకు దివ్యకార్య నిర్వహణభారమును వహింపవలయుటయే యుచితమనియుఁ గీర్తికరమనియు భావించెను. భావించి దిక్పతుల నవలోకించి, "దిక్పాలులారా! మీయభీష్ట మీడేర్తును; మిమ్ములను వరింపుమని యా దమయంతికి నాశక్తివంచనలేకుండ బోధింతును; కాని ఫలితమునకు మాత్రము నేను బాధ్యుఁడను గాఁజాలను; ఆ యువతీమణి మిమ్ములం జేఁబట్టుట కంగీకరించునో, అంగీకరింపదో నేను చెప్పఁజాలను. నేను చేయవలసినదానిని త్రికరణశుద్ధిగాఁ జేయుదును. పిమ్మట మీభాగ్యము." అని నుడివి తన రూపము దమయంతిని వసించుచున్న యంతిపురిలో సంచరించు చెలికత్తెలకుఁ గనఁబడకుండునట్లును దానుమాత్ర మెల్లరనుఁ జూడగలుగునట్లును దిక్పతుల వలనఁ దిరస్కరిణీవిద్య నభ్యసించి, విదర్భకు బయలుదేరెను. ఓ ధర్మనందనా! చూచితివా నలసార్వభౌముని మహాత్యాగము! సుస్థిరమయిన కీర్తి నపేక్షించి యమ్మహానీయుఁడు దాను మిక్కిలియుఁ బ్రేమించిన కాంత నితరులను బెండ్లియాడుమని ప్రోత్సహించి చెప్పఁ బోవుచున్నాఁడు. అనఁగాఁ దన ప్రేమమును, ప్రేమైకమూలమగు సౌఖ్యమును బరుల సౌఖ్యముకొఱకు బలిచేయనున్నాఁడు! అనృతదోషమునకు భయపడి యాత్మార్పణము నేయుచున్నాఁడు. పదునాల్గు భువనములందును నలునిఁబోలిన లలితవర్తనుఁడు వేఱొకఁడు లేఁడుగదా! ఇఁక నవ్వలికథ నాలకింపుము" అని బృహదశ్వ మునీంద్రుఁడు మరలఁ జెప్పఁదొడంగెను.

— నలుఁడు దమయంతితో భాషించుట —

నలుఁడు విదర్భంజేరి తిరస్కరిణీ విద్యాప్రభావంబువలన నంతఃపురముం బ్రవేశించి, ఖడ్గపాణులై బారులుదీరి సహరాయిచ్చుచున్న

భటులనెల్లరను దాఁటి దమయంతియుండు గదిం బ్రవేశించెను. ఆమెను జూచి స్వస్వరూపమును బ్రకటించెను. అంత దమయంతి యాకస్మిక ముగాఁ దనసమ్ముఖమున నట్టి జగన్మోహనాకారుఁడు సాక్షాత్కరించి నందుల కింతింతనరాని సంతోషమును, ఆశ్చర్యమును జెందెను. ఆ నూతనాగంతకుఁడు శ్రీమన్నారాయణుఁడో, లేక, మన్మధుఁడో, కాక తాను త్రికరణశుద్ధిగాఁ బ్రేమించిన నలుఁడో అయియుండవలె ననియు సమర్థులగు పెక్కుమంది రక్షకభటులచేఁ బరివేష్టితంబగు రాణి వాసముం బ్రవేశింప నన్యులకు శక్యముగాదనియుఁ దలంచెను. ఆమె ధైర్యమును దెచ్చుకొని లజ్జచేఁ దటాలునఁ దెరమాటునకేఁగి యిట్లు మృదుమధురస్వరమునఁ బలికెను. "ఓపురుషసింహమా! అందున్న యుచితాసన మలంకరింపుఁడు. మీ నామముచేఁ బవిత్రములయిన యక్షరములేవి? మీ గోత్రమెయ్యది? ఎందుండి యిందువచ్చితిరి? స్త్రీజన నివాసస్థల మాయుధపాణులగు భటులచేఁ బరిరక్షితమైయుం డఁగా మీరెట్లు ప్రవేశింపఁగలిగితిరి?" ఈ పలుకులకు మందహాసాం చితవదనుఁడగు నలుండిట్లు మాఱుపలుకుచున్నాఁడు. "ఓ కన్యా రత్నమా! వినుము. నేను నిషధదేశాధిపతిని; వీరసేన తనూభవుం డగు నలుండనువాఁడను—నేను దేవదూతనై నీకడకు వచ్చియున్నాఁ డను. వినుము. ఇంద్రాగ్ని యమవరుణులు నలువురును నీయందు మిక్కియు మక్కువగలిగియున్నారు. వారు నిన్నుఁ బరిణయమాడఁ గోరి నీయొద్దకు నన్ను దూతగాఁబంపిరి. ఆ నలువురిలో నీవు నీ యిచ్చ వచ్చిన సచ్చరిత్రుని వరించి హెచ్చుగా సుఖింపవచ్చును. ఆహా! దివ్యులహృదయములనాకరింపఁగలిగిన నీభాగ్యమనుపమానముగదా!" అని నలుండింకను దాను చెప్పఁబోవునది ముగింపకపూర్వమే దమయంతి అదరిపడి యిట్లనెను. "రాజేంద్రా! మీపలుకు లాశ్చర్యకరములు మాత్రమేకాక, సంతాపకరములుకూడ నగుచున్నవి. నేను మనుష్య

జాతియం దుద్భవించితిని. మీారిప్పుడు చెప్పిన యింద్రాగ్ని యమవరుణులు దేవతలు. దేవతలకు దేవకాంతలే వలయునుగాని మర్త్యకాంతలెందులకు? మర్త్యకాంతలం గోరుట వారికనుచితముగదా! అదియునుంగాక దివ్యులు మానవులకుఁ బితృసమానులగుటంజేసి, వారు నాకుఁ బితరులు. అప్పట్ల నన్నుఁ బెండ్లాడవలయునన్న తలంపు వారికేల గలుగవలయును? కంచెయే చేనుమేసిన నింకదిక్కేమున్నది? ధర్మమును సంరక్షింపవలసిన దిక్పాలురే యధర్మారంభమునకుఁ గడఁగుచున్న నింకఁ జెప్పవలసినదేమున్నది? దిక్పతులు సర్వజ్ఞులు. వారికి నాచిత్తవృత్తి తెలియదా? మదీయహృదయ మీావఱకే యొకయుత్తమ రాజపుత్రునియందుఁ దవిలియుండఁగా దానిని నేనిప్పుడు మార్చుకొనఁ గలనా? అది నాపనికాదు. కాఁబట్టి నన్నుక్షమింపుఁడు—నేనందులకంగీకరింపను". నలుండు దమయంతియొక్క పలుకులాలకించి యామె మనోనిశ్చయత్వమునకు లోలోన హెచ్చుగమెచ్చుకొనియుఁ దాను వచ్చినకార్యమును త్రికరణశుద్ధిగాఁ బరిసమాప్తినొందింపఁ బ్రయత్నించి యామె నవలోకించి యిట్లనెను. "ఓ కన్యకామణీ! సిరిరా మోకాలొడ్డువా రెవ్వరయిన నుందురా? దుర్లభంబయిన తపముచేతనయినను బొందఁగూడని దివ్యులే తమంతఁదాము వలచివచ్చినఁ జులకనచేయనేల? అమరాధిపుండు సామాన్యుఁడా? త్రింశత్కోటి దేవతలును ముప్పొద్దులందు వానికి మ్రొక్కుచుందురు; యజ్ఞభోక్తయగు నామహాత్ముఁడు నూఱుజన్నములొనరించి, శతక్రతువనుపేరఁ బ్రసిద్ధిఁగాంచెనుగదా! త్రిలోకాధిపత్యము వహించి యఖండవైభవాన్వితుఁడై చెన్నొందువానిం దిరస్కరింతువేల? అగ్నిహోత్రుఁడు పరమపావనుఁడుగదా? వానినయిన నగ్గించి కామింపవేల? లోకాధారభూతుఁడగు వరుణుఁడు జీవమిచ్చి జీవమును గాపాడుచున్నాఁడుగదా! అట్టి లోకోపకారశీలుని బెండ్లియాడ నొల్లవేల?

సర్వజీవుల కర్మములను నిష్పాక్షికబుద్ధితో విమర్శించి తత్తదుచితము లగు శిక్షల నిడువాఁడు ధర్మాత్ముఁడు యమధర్మరాజు. వానియందు నీకు మక్కువయేల కుదురదు ? ఈ దివ్యులలో నొకరిని నీవు వరించిన యెడల నీకును వారితోఁబాటు దివ్యత్వము బ్బునుగదా ! నీచమగు మానుషత్వము పోవునుగదా ! కనుక నెక్కుడుఫలము అప్రయత్నముగాఁ బ్రాప్తించుచుండఁగా ప్రయత్నపూర్వకముగా తక్కువఫలము బొందఁజూడకుము. దిక్పతుల భార్యవయిన నీకుఁగలుగు గౌరవాతిశయమును మనసునం దూహించుకొనుము. ముప్పదిమూడుకోట్ల దేవతలును నీకనుసన్నల మెలంగుదురు. రంభ, ఊర్వశి, తిలోత్తమ, మేనక మున్నగు సుందరీమణులు నీయింటి మొగసాలయం దూడిగమునేయుదురు. నీకీర్తి దిగంతవ్యాప్తమగును ; నీనామము సర్వజనసంస్మరణీయమగును ; నీ కనుభవములగు భోగభాగ్యములును, సౌఖ్యములును వర్ణనాతీతములగును." దమయంతి నలుని నుడులకు మిక్కిలి బరితాపమందెను ; కర్తవ్యమును దెలియని గోలవలెఁ గొంతతడవామె మున్నకుండెను. పిమ్మటఁ గనులనుండి జలకణములురాలి చెక్కుటద్దములయందుఁ బ్రతిఫలించుచుండఁగా, డగ్గుత్తికతో నతిదీనములగు చూడ్కులను నలునిముఖారవిందముపైఁ బ్రసరింపఁజేయుచు, "ఓ రాజవతంసమా ! మీరేల నాహృదయమును శోధింపఁజూచెదరు ? అయిష్టములగు వాక్యముచే నాచిత్తము నేలకలంచెదరు ? నేను నా మనోగతాభిప్రాయము నెఱిఁగించుచున్నాను వినుఁడు. మిమ్ములను మనోవాక్కాయకర్మములచే గాఢముగాఁ బ్రేమించితిని. నాచిత్తము భవదధీనమైయున్నది. మీ కెఱుకపఱుటకుఁగాను లజ్జవిడిచి చెప్పుచున్నాను. వినుఁడు. నా ప్రేమతత్త్వమును గణించి, నన్ను నిరాకరింపక, చేపట్టితిరా, మేలు ! నన్నుఁజేపట్టనొల్లరా మీపాదసన్నిధినే ప్రాణపరిత్యాగము గావింతును. వేఱుమాటలు నా చెవికెక్కవు. అన్యులను

ప్రేమింప మీరు నాకుఁ బ్రోత్సహింపవలదు. దిక్పాలు రిమ్ముల్లను వేఁడుకొని దూతగాఁ బంపితిరేయనుకొందు. మీరు మనఃపూర్వక ముగా మీకార్యమును నెఱవేర్చితిరి. కాని ఫలమునకు మీరు కర్తలు కారుగదా! కాఁబట్టి వారికి నామాటలుగా నిట్లు విన్నవింపుఁడు ; " ఓ యింద్రాగ్నియమవరుణులారా! మీరు నాకు జనకసమానులు ; నేను మీపుత్త్రికను. పుత్త్రిక సౌందర్యవతియని యామెయందు జనకుండెందయిన సమ్మోహితుండు కాఁదగునా ? మీరు సర్వజ్ఞులరు. మీ కెఱుకపడని విషయమొండులేదు. నాచిత్త మీవఱకే నిషధేశ్వ రునియందు లగ్నమైయున్నది. అన్యాయత్తమగు మనస్సును మీరు త్రిప్పలేరు. మీకోరికను నిరాకరించితినని నాపైఁ గినుకఁబూనక, యుదారబుద్ధితో నన్ను విడిచిపెట్టుఁడు. నాయందలి మమతను వీడుఁడు ". అని నుడివెను. నలుండు మాఱువలుకఁజాలక ఆమె యొక్క నిశ్చయము నభినందించుచుఁ దనభాగ్యమును హెచ్చుగా మెచ్చుకొనుచు నామెను వీడ్కొని బృందారకుల సన్నిధికరిగెను. అంతకుఁ బూర్వమే దిక్పతులు దివ్యదృష్టివలన దమయంతి యంతిపురిని జరిగిన వృత్తాంతమంతయుఁ దెలిసికొన్నవారగుటవలన, నలునిఁజూచి, " ఓ పుణ్యపురుషా! నీవు సత్యసంధుఁడవు. త్యాగశీలుఁడవు. మాకు బాసచేసిన రీతిని మనఃపూర్వకముగా నీవు చేయవలసిన పనినిజేసితివి. ఆమె యందుల కొడంబడలేదనియు నీవు కార్యసాఫల్యమును గాంచ లేదనియు విచారింపఁబనిలేదు. మాకిఁక సెలవుదయచేయుము. మేము నీయెడ సర్వదాకృతజ్ఞులమై యుందుము. నీయుపకారమును మరచి పోము. " అని యాతనిచే సత్కరింపఁబడి, తమతమ నెలవులకుఁ బోఁదలంచియు, దమయంతియందు మక్కువ మిక్కుటముగాఁ గలిగి యున్నవారగుటచేతను, ఆమె నలునిఁ బెండ్లాడనున్నదని గ్రహించిన వారగుటచేతను, స్వయంవరమంటపమునం దెల్లరును నలరూపము

లతోఁ బ్రత్యక్షముగావలెనని తలంచి సన్నాహములు గావించుకొను చుండిరి. నలుండును సముచితవిధంబున మహోత్సాహంబుతోను, మహావైభవంబుతోను, విదర్భదేశమునకుఁ బయనమైపోయెను. భీమ రాజాతనికి స్వాగతమిచ్చి తోడ్కొనిపోయి, అర్ఘ్యాగతిని సత్కరించి యొకసుందరభర్మ్యమందిరమున విడయఁజేసెను.

## — దమయంతీ స్వయంవర మహోత్సవము —

మరునాఁటి సూర్యోదయముననే పురోహితనిర్దిష్టమగు శుభ ముహూర్తమున దమయంతీ స్వయంవరము గానుండుటచేత, నానా విధామూల్యమణిప్రభాభాసితంబును, స్వర్ణపీఠాంచితంబును, ముని గాయకవందిమాగధ మంత్రిపురోహిత సామంతదండనాథపురప్రము ఖాలవాలంబును, నై రంభాస్తంభములతోను, పచ్చతోరణముల తోను గై సేయఁబడి నేత్రపర్వముగనున్న స్వయంవరమంటపమును రాజులెల్లరును బ్రవేశించిరి. నలుండును నందుఁదగిన హేమపీఠిని నుప విష్టుఁడై యుండెను. ఇంద్రాగ్నియమవరుణులు నల్వురును దమయంతిని వంచింపవలయునన్న తలంపుతో నలునిరూపములంగై కొని యాతని ప్రక్కనే ఆసీనులై యుండిరి. కొంత తడవయినపిమ్మట మంగళవాద్య ములు మ్రోయసాఁగెను; వేదసంపన్నులగు బ్రాహ్మణుల శ్రావ్యకం ఠములు లేచెను; మంగళస్నాన మాచరించి మృదులదుకూలమును ధరించి, పరిమళద్రవ్యములను మంచిగంధమును మేననలందికొని యమూల్యాభరణభూషితయై మేఘమాలికలమధ్యఁ జెన్నొందు మెఱు పుఁదీఁగయో, యిలకు దిగుచున్న రతీదేవియో యనునట్లుగా ప్రకా శించుచు పుణ్యాంగనలు నివాళులీయఁ జెలికత్తె లోసరములందుండ దమయంతి రాజహంసకు నడకలునేర్పు తెఱంగున స్వయంవరమంటప మును బ్రవేశించెను. సభాస్థలినలంకరించిన రాకుమారులెల్లరు నామె

సౌందర్యలావణ్యాదులరసి యాశ్చర్యమునొంది "ఆహా! ఈ జగదేక సుందరినిబొందు ధన్యాత్ముఁడెవ్వఁడోకదా!" యని తమలోఁ దామను కొనుచు శీవిగాఁ గూర్చుండిరి. ముందు నడచుచున్న చెలికత్తె సభా స్థలినలంకరించిన రాకుమారులలో నొక్కొక్కనియొద్దకుఁ గొనిపోవుచు నతని నామధేయమును, కులగోత్రాదులను, శౌర్యధైర్యసాహసౌం దార్యాది సద్గుణపుంజములను, వానిం బ్రకటించుచర్యలను, సౌందర్య విశేషమును అభివర్ణించుచుఁ బోవుచుండెను; కాని పుష్పదామము హస్తములందుఁ గ్రాలుచుండఁగా, దమయంతి యద్వితీయమగు సోయ గమునఁ దనరుచు నేరాజసుతునిగూడఁ గనులెత్తి చూడసయినఁజూడక, తిన్నఁగా నలుండున్న వేదికకడకుఁ జెలికత్తెలతోఁ బోయెను. అట నలరూపములతో నయిదుగురు లోచనములకుఁ గన్పట్టఁగా నామె యాశ్చర్యవిస్మయములందెను; క్షణకాలమునటకుఁ గర్తవ్యమెఱుంగక యున్నకొండెను. తరువాతఁ గనులుమూసి, హృత్కమలములందు జగన్మా తను ధ్యానించుకొని, "మాతా! నేను నీబిడ్డను. దివ్యులు నలరూప ములు ధరించి యుపవిష్టులైరి. ఇటఁగల నలపంచకములో నలుని నేను దెలిసికొనలేకయున్నాను. నాకు నిషధదేశాధిపతిని మాత్రంచూపి మదీ ప్సితమును నెఱవేర్పుము" అని భక్తిపూర్వకముగాఁ దలంప నద్దేవ దేవియు నామెయందుఁ బ్రసన్నురాలాయెను. తత్ప్రసన్నతాభావము వలన దమయంతి నిజమయిన నలుని గుఱుతించి, చేతనున్న పుష్పమా లతో నాతని కంఠమునలంకరించెను. తోడనే దేవదుందుభులు మొఱ సెను; పుష్పవర్షము గురిసెను; బ్రాహ్మణోత్తముల యాశీర్వచన ములతోఁబాటు, రాకుమారుల జయాజయధ్వానములును పిక్కటిల్లెను. ఈ వధూవరులు సర్వవిధముల నొకరికొకరు తగియున్నారని యెల్లరును హర్షించిరి. భీమరాజు మహాత్ముండగు నలుండు దనకు జామాతయగుట మహాభాగ్యమనుకొని యుచితగతిని నలదమయంతులను దోడ్కొని

పోయి మంగళస్నానములు చేయించి, శాస్త్రోక్తవిధమున నయ్యిరువు రకు మహావైభవమునఁ బరిణయముగావించెను. పరిణయసందర్భము నెల్లరను వారి వారి గౌరవములకుఁ దగినరీతిని సత్కరించెను. ఇంద్రాగ్ని యమవరుణులును దమ ప్రయత్నములు విఫలమగుటకుఁ జింతించి, దమయంతియొక్క అంతఃకరణశుద్ధికి హర్షించి, తమ లోకమునకుఁ బయనమయిరి.

## — శనైశ్చరుఁడు దిక్పతుల కెదురుపడుట. —

దివ్యవిమానారూఢులై నాకమునకుఁ బోవుచున్న యింద్రాగ్ని యమవరుణులకు మార్గమధ్యమున సూర్యభగవానుని తనూభవుం డయిన శనైశ్చరుం డెదురుపడెను. అతనిం జూచి దిక్పతులు. "సూర్య పుత్త్రా! ఎక్కడకుఁ బోవుచున్నావు?" అని ప్రశ్నించిరి. ప్రశ్నింపఁగా "భూలోకమున భీమరాట్పుత్త్రికి దమయంతికి స్వయంవరము జరుగఁ బోవుచున్నదఁట! ఆస్వయంవర మహోత్సవమున నామెను బెండ్లాడఁ గోరి పోవుచున్నా"నని శనైశ్చరుఁడు బదులుచెప్పెను. ఆమాటలు విని పరిహాససూచకముగా దిక్పతులు పెద్దపెట్టున నవ్వఁదొడంగిరి. తన్నుఁ జూచి వారేల నవ్వుచుండిరో తెలిసికొనలేక శనైశ్చరుఁడు తెల్లఁబోయి చూచుచుఁ గొంతతడవు మిన్నకుండెను. అప్పటికిని దిక్పతులు నవ్వుచు నేయుండిరి. అప్పుడాతఁ 'డయ్యలారా! దమయంతిని బెండ్లియాడఁ బోవుచున్నానని చెప్పఁ మీరేల పరిహసించుచున్నార' ని యడిగెను. "అగునగును. ఆభ్రాంతికే మేము నిన్నుఁ బరిహసించుచున్నాము. మేమును నీవలె భ్రాంతిగొని యాలావణ్యగాత్రికొఱకుఁ బెక్కుపాట్లు పడితిమి; అనేకములగు ప్రయత్నములు చేసితిమి; కాని యవి యన్నియు ను నిష్ఫలములయినవి." అని దివ్యులనిరి. "ఓహో! మీరు అసమర్థులయినంతమాత్రాన—మీ ప్రయత్నములు వ్యర్థములైనంత

మాత్రాన నన్నుఁ బరిహసించుచున్నారా? నేను మీవలె శూన్య హస్తములతోఁ రాను ; చేతకానివాఁడనుగాను. స్వయంవరమునందామెను బెండ్లియాడి వెంటబెట్టుకొనియే వచ్చెదను.” అని శనైశ్చరుఁడనఁగా దేవతాధిపులు మఱియు బిగ్గఱగా హసించి, “వెఱ్ఱివాఁడా! దొంగ చచ్చిన యాఱునెలలకుఁ గుక్క మొఱిఁగెనన్నట్లు దమయంతీ స్వయం వరమహోత్సవము ముగిసిన పిమ్మట నీవు తొందరపాటుం జెందెదవేల? దమయంతి సుప్రసిద్ధ సార్వభౌముండయిన నలుని గామించి, ప్రేమించి పెండ్లియాడెను.” అనిరి. ఆపలుకు లాలకించి, శనైశ్చరుఁడు దండతాడి తభుజంగముచందమున మండిపడి, “ఔరా! ఏమి? దమయంతి యొక మానవమాత్రుని వరించినదిగా? ఆనలుఁడు మనకంటె నధికుఁడా? మనకంటె సమర్థుఁడా? ఆతనికున్న వైభవాతిశయము మనకు లేదా? కామరూపధరులమగు మనము నలునివలె నందముగ నుండలేమా? ఆనలుఁడుమాత్ర మెట్లామెను బెండ్లియాడినాఁడు? దివ్యులు కాంక్షిం చిన వస్తువును దాను గొత్తఁగొనుట కంతటి సమర్థుఁడా? కానిండు. నాసామర్థ్యము నాదంపతులకుఁ జూపెంచెదను. వలచి వలపింపఁజేసినం దులకు నలదమయంతులకుఁ గడలేని కడఁగండ్లు కల్పించి వేధించి తీరె దను.” అని యింద్రాగ్ని యమవరుణులకడ సెలవు గైకొని వారి ప్రోత్సాహము నూతగాఁగొని విదర్భదేశముం బ్రవేశించి కామరూప ప్రభావంబువలన నొక బ్రాహ్మణుఁడై తరుణము కొరకు వేచి యుండెను.

—నలుండు దమయంతితో విదర్భ విడిచి, నిషధకు బయలుదేరుట.—

నూతన వధూవరు లిరువురును భీమరాజ భవనమునందుఁ గొన్ని దినములు సుఖముగానుండి వినోదంబులచేఁ బ్రొద్దుపుచ్చిరి. తరువాత

నలసార్వభౌముఁడు "ప్రాణేశ్వరీ! మనమిఁక మన నగరమునకుఁ బోవు దము; రమ్మ"నఁగా దమయంతి వల్లెయనెను. భీమరాజు కూఁతు నత్త వారింటికిఁ బంపుటకుఁ దగిన సన్నాహములు గావించెను; రథతురంగ దంతావళాదులను, నవరత్నములను, బంగారు పుట్టములను, దాసదాసీ జనములను గూఁతున కిచ్చెను. ఒక శుభముహూర్తమును ప్రయాణా ర్థముగ నిర్ణయించెను; తల్లిదండ్రులు దమ కూర్మిబిడ్డయొక్క వియో గమునకు మిక్కిలియు వగచి యెట్టకేల కుపశమనమొందిరి. నిర్ణీతము హూర్తమున మంగళవాద్యములు మ్రోయుచుండఁగా, బ్రాహ్మణాశీ ర్వాదములు మిన్నుముట్టుచుండఁగాఁ వందిమాగధుల కైవారములు చెలంగుచుండఁగా, చతురంగబలంబులు సాఁగిపోవుచుండఁగా నుత్తమ స్యందన మధిరోహించి నల దమయంతులు నిషధాభిముఖులైరి. భీమ రాజు, మంత్రిపురోహిత సామంతాదులతో పురబాహ్య ప్రదేశము వరకు నల్లుని సాఁగనంపి మరలిపోయెను. కతిపయదినంబులకు నలుండు దమయంతితో నిషధం జేరుకొనెను. ప్రభునియాగమనము నంతకుఁ బూర్వమే యాలకించి యున్నవారగుటచే నుద్యోగులు నగరమును సముచితగతి నలంకరించి యధికారులతోను, విప్రదండములతోనుఁ మంగళవాద్యములతోను, చతురంగబలములతోను నెదురేఁగిరి. ప్రభు దంపతులకుఁ బురప్రముఖులు వందనము లాచరించిరి. పెద్దలు వారి నాశీర్వదించిరి. సామంతులు కానుకలు సమర్పించిరి. పుణ్యాంగనలు కంకణ క్వణక్వణ ధ్వనులతోఁ గరములెత్తి హారతులిచ్చిరి. ఆబాలగోపా లము హర్షముతో జయజయధ్వానము లొనరించెను. నలుఁడు పుర ప్రవేశ మొనరించెను. బ్రాహ్మణుల కగ్రహారములుఁ సరదారులకు జాగీరులు, సామంతులకు బిరుదములు, దండనాథులకుఁ బతకములు, బీదలకన్న వస్త్రములు మున్నగువాని నొసంగెను. కవులను సన్మానిం చెను. కొన్నిదినములవరకు నగరమునందంతటను గానసభలు, హరి

కథలు, నాటకములు మున్నగు వానితోఁగూడిన మహోత్సవములు సాఁగెను. నలుండును లావణ్యరాశియగు దమయంతితోఁగలిసి మదనుని గర్వము నడంచుచు సుఖంబుండి ప్రజానురంజకముగా రాజ్యపాలనము సేయుచుండెను. " ఇట్లు బృహదశ్వమునీంద్రుఁడు చెప్పిన నలచరిత్రము నత్యంత శ్రద్ధాభక్తులతో ధర్మనందనుం డాలకించి హర్షించెను.

ప్రథమభాగము

సంపూర్ణము.



ఓమ్.

శ్రీ రా మా !

# శ్రీనలమహారాజు కథలు.



## ద్వితీయ భాగము.

ధర్మనందనుఁడు బృహదశ్వునవలోకించి, "ఓమునిచంద్రమా! తరువాతికథ నాలకింపఁ గుతూహలము మెండగుచున్నది; వినిపింపుడ" నఁగా, బృహదశ్వుఁడు చెప్పఁదొడంగెను. "ఓధర్మరాజా! వినుము. దమయంతీదేవితోఁ గలిసి సుఖింపుచు నలుండు ప్రజానురంజకముగా రాజ్యపాలనము సేయుచుండెను; ఆతని యేలుబడిలో నెలకు మూఁడు వర్షములు గురియుచుండెను; ప్రజలేవిధమయిన కొఱంతయును లేక, ధర్మబద్ధులై, శాస్త్రోక్తగతులఁ దమజీవయాత్రలను నలుపుచుండిరి. దమయంతియు నంతర్వత్నియై నవమాసములు నిండిన వెనుక నొకశుభ ముహూర్తమున నభినవమన్మథుం డనఁదగిన కుమారుని బ్రసవించినది. పుత్రోత్సవమును శ్రీనలమహారా జత్యంతవైభవమున జరిపెను. ఆ సందర్భమున నలుండు తనదేశమునందలి పౌరులనెల్లర నుచితగతిని సత్కరించెను; సమస్తదానము లొనరించెను; పుత్త్రున కుచితగతిని విధ్యుక్తకర్మము లాచరించెను; ఇంద్రసేనుఁడని పేరిడెను. వసిష్ఠాది మహర్షులను రావించి వారిచే జాతకాదుల వ్రాయించెను; ఇంద్రసేన కుమారుండును దినదినాభివృద్ధి నొందుచుండెను. ఈ ప్రకారము కొన్ని దినములు గడచినవి. తరువాతఁ గొంతకాలమునకు మరల దమయంతి గర్భవతియై యొక కన్యారత్నమును బ్రసవించెను. తండ్రి తన్నుఁ

బోలిన కుమారుని, తల్లి తన్నుఁబోలిన కుమార్తెను బడయుటచేత నింతింతనరాని సంతోషమును బొందుచుఁ గాలమును సుఖమయముగాఁ గడపుచుండిరి. అట శనైశ్చరుఁడును విదర్భనుండి నిషధదేశమునకుఁ దిరిగివచ్చెను. నలునిలోఁ బ్రవేశించుటెట్టులాయని యాతఁడాలోచించు చుండెను. తొలుతఁ దాను దిక్పతుల మ్రోల నలునొక సామాన్యరాజ పుత్రునిగాఁ దలంచెను; తలంచియే, తన ప్రతాపమును వ్యక్తపఱిచి నంచింతునని బింకములు పలికెను. కాని నలుండు ధర్మాత్ముఁడనియు, సదాచారసంపన్నుఁడనియు, న్యాయైకశీలుఁడనియు, సత్యసంధుఁడనియు, శుచిమంతుఁడనియుఁ దెలిసికొనెను; పరాంగనాసాంగత్యాభిలాషగాని, దుష్కార్యారంభ ప్రయత్నముగాని, లేక తక్కుంగల యశుచికరము లగు నకార్యములుగాని, యనుచితాలోచనములుగాని యతనికడ లేవు. ఆతఁడు లోకైకపూజ్యుఁడు. అట్టిచో నతనిలోఁ బ్రవేశించుటయెట్లు? అని శనైశ్చరుఁడు పరిపరివిధముల యోచింపసాఁగెను. కాని మార్గ మేదియు నతనికిఁ గనఁబడలేదు. తనపంతము వీఁగిపోవునన్న భయము కూడ వానికిఁ గలిగినది. కాని యంతమాత్రాన నిరుత్సాహమునుజెం దక, సర్వవిధములఁ బ్రయత్నము సేయవలయునని ద్విగుణీకృతోత్సా హముతోఁ గృతనిశ్చయుఁడై యాతఁడు సమయముకొఱకు వేచియుం డెను. తుదకాతని కొకయాలోచన ముదయించినది. నలునిచేఁ బరిపా లితంబగుచున్న నిషధదేశమునఁ గ్రూరజంతుసంతానముల నుత్పత్తినొం దించి ప్రజల వేధింపవలెనని యాతఁడు సంకల్పించెను. ఆ సంకల్పాను సారము కిటికేసరి శార్దూల గండభేరుండాది భయంకర వన్యమృగములను లక్షోపలక్షలుగా సృజించెను. అయ్యవి యడవులయందు వసించుచుఁ బరిసరప్రాంతములందున్న పల్లీపట్టణంబులపైఁబడి పంటలు పాడుచే యుచుఁ బశువుల మ్రింగివైచుచుఁ బరిపరివిధములఁ బ్రజలను హిం సించుచుండెను. అంత శనైశ్చరుండొక బోయని వేషమూని, పుర

జనులఁ గొందఱను వెంటనిడుకొని, రాచనగరున కేతెంచి నలమహా రాజు నిండుకొలువై యుండఁగా నమస్కరించి, ప్రక్కకొదిగి నిలువఁ బడి యిట్లు విన్నవించెను. "ఓమహా ప్రభూ! ఇంతదనుకఁ దమచేఁ బరిపాలితంబయియున్న దేశమునందెందును, ఎట్టిబాధయును లేక, సుఖ మతిశయించియున్నది. కడుపులోనిచల్ల కదలకుండఁ బ్రజలు మనుచుం డిరి. జంతువులన్నియును జాతివైరమును మరచి మసలుచున్నవి; పులి యును, ఆవును నొకేగర్భమునుండి వెలువడినరీతి నత్యంతస్నేహముతో నొకేవాఁగున నీరుద్రావుచు నొకే తోఁటయందు మేఁతను మేయు చున్నవి. కాని యీనాఁడదేమికర్మము వాటిల్లినదో చెప్పఁజాలము. ఎన్నఁడును గనివినియెఱుంగని వింతవింతమృగము లేఁదితములై, పల్లీ పట్టణములందలి పైరులకును, పశువులకును, ప్రజలకును హానిగలిగించు చున్నవి. ఓ దేవా! తాము శ్రద్ధవహించి, నత్వరమ్మున బయలుదేరి దుష్టమృగములను సంహరింపకున్నచో, మాజీవితములు దుర్ఘటము లగుచున్నవి". నలుం డాశ్చర్యమొంది, పురజనులకుఁ గలిగిన విపత్తు నకు జాలిగొని సాదరంబుగ నిట్లనెను. "ఓపౌరులారా! మీరు చెప్పిన చొప్పు మాకాశ్చర్యము గలిగించుచున్నది. ఎన్నఁడునులేని క్రూర మృగము లెట్లుత్పత్తినొందినవో తెలియకున్నది. కానిండు. మీరు మీమీగృహంబుల కరిగి నిర్విచారముగ నుండుఁడు. నేను శీఘ్రగతిని బయలుదేరివచ్చి యీ వన్యమృగములను జంపి, మీబాధల నుడిపె దను." అని, ప్రజలను బంపివైచెను. తరువాతఁ గొలఁది దినములకే సపరివారముగ నాయుధములతో నలుండు ఆలుబిడ్డలతోఁగూడఁ గానకుఁ బయనమయ్యెను. అడవియందు పులులు, సింహములు, ఎలు గులు, గండభేరుండములు, అడవిపందులు మున్నగు జంతువులనెల్లఁ దద్దయుం బెద్దప్రొద్దు వేఁటాడి చంపెను. అరణ్యమునందు మచ్చున కయిన నొక్కక్రూరమృగము లేదనునట్లు నిశ్శేషముగాఁ జంపి చంపి,

వేఁటతమకంబునఁ గడుంగడు బడలి యొకవృక్షచ్ఛాయఁ జిగురుటాకు పాన్పుమీఁద దయయంతీదేవియొక్క అంకతలమున శిరసుంచి నిద్రింప సాఁగెను. అంతలో నామహారాజు గాఢనిద్రాపరవశుండై యొక కలఁ గని యదరిపడిలేచెను. "దేవా! ఇదేమి? ఎన్నఁడునులేని యీ అదరుపాటు నేఁడేలకలిగినది?" అని దమయంతి ప్రశ్నించి శీతలోపచారములొనరింపఁ గొంతతడవునకు సేదదేఱి చిత్తస్వస్థతకుదుర నిట్లనినుడివెను. "ప్రాణప్రియా! దుస్స్వప్నమొకటి వచ్చినది. మన మిరువురమును నగరు విడిచి, భోగములు విడిచి యడవులంబడి పోవుదుమఁట; మన రాజ్యము జూదమునందు వంచనాన్వితముగ నపహృతమగునఁట! అడవియందు మన మిరువురము నొకరి నొకరెడఁబాసి, చెప్పనలవికాని బాధలను బొందుదుమఁట; చివరికా శ్రీమన్నారాయణుండు కరుణాఘుండై మన యాపదలను గడవఁబెట్టి, మనరాజ్యమును, భోగములను, సుఖములను మరల మనకొసంగునఁట." దమయంతి ప్రాణనాథునితో, "దేవా! కలఁగని తామింత బెదరనేల? మీరు ధర్మవిదులు; మీకెఱుకపడని విషయముగాని, న్యాయముగాని యెందునులేదు; స్వప్నమున గోచరించిన కష్టములే యదార్థములయినను, మీరు చింతింపనేల? విధివిధానమును బాఁటనేరికిశక్యము? ఏప్రాణి యెప్పుడు సుఖింపవలయునో, ఎప్పుడు కష్టపడవలయునో యది బ్రహ్మనిర్దిష్టము గదా! శివునాజ్ఞలేనిదే చీమయినఁ గుట్టదన్నసామెత యుండనేయున్నది. ప్రభూ! మనము కష్టములు పొందవలెననుట యీశ్వరసంకల్పమే యైనయెడలఁ దాని నెవరు తప్పింపఁగలరు? కాఁబట్టి కలఁగన్నమాత్రానఁ జిత్తవైకల్యమును బొందుట తమబోటి ధీరులకుఁ దగవిపని; స్వస్థతను జెందుఁడు." అనెను. నలుండును వ్యాకులత నుడిగి, తరువాత మృగయాసన్నాహము ముగిసిన పిమ్మట స్వజనులతోఁ దిరిగి నిషధకేతెంచి సుఖంబుండెను. అప్పటినుని శనైశ్చరునకా చక్రవర్తియం

దెవ్విధమయిన యశుచిత్వమును గనఁబడలేదు. నమయ మెప్పుడు చిక్కునా, ఎప్పుడు నలుని వేధింతునా" యని యాతఁడు కనిపెట్టు కొనియుండెను. కొంతకాలము గడచినపిమ్మట నొకదినమునఁ బ్రాతః కాలమందమ్మహారాజు దేహబాధఁ దీర్చికొని కాలుసేతులం గడిగికొను చుండఁగాఁ బాదమునందేమూలనో సూదిమొనయంత చోటు తడియక మిగిలిపోయెను. అదియే తగినసమయమని శనైశ్చరుఁడు నలునిలోఁ బ్రవేశించెను.—వింటివా? ధర్మనందనా! నాఁటినుండి యామహా నీయుని గ్రహబలము మాఱినది; ఆతనికిఁ గష్టదశ ప్రాప్తమయినది; సుఖదినములు మరలినవి. అదెట్లో చెప్పుచున్నాను; వినుము.

నలునితోఁ జూదమాడఁ బుష్కరుని శనైశ్చరుఁడు ప్రోత్సహించుట.

శనైశ్చరుఁడు నలునకుఁగల యేఁబదియాఱుమంది సామంతరాజు లలో నొక్కఁడయిన పుష్కరుఁ డనువాని పాలికింజని యిట్లనెను. "రాజా! పుష్కరా! నేను సూర్యభగవానునకును ఛాయాదేవికిని జన్మించినవాఁడను; శనైశ్చరుఁడను. మన్నామము నాలకించినంతమా త్రాన ముక్కోటిదేవతలును గడగడ వడంకుదురు; సర్వలోకేశ్వరు లయిన హరిహరాదులుసైతము నన్నుఁ బ్రతిఘటింప వెరతురు. దిక్పా లురు నాయాజ్ఞలను మాలింపాల్తురు. నాసామర్థ్యము జగద్విదితము. నేనిప్పుడు నీమూలమున నొక కార్యమును నెఱవేర్చుకోఁదలంచి వచ్చి నాఁడను. నిషధేశ్వరుండగు నలుండు సార్వభౌముఁడుగదా! ఆతని కిప్పుడు నీవు సామంతుఁడవై యున్నాఁడవు; ప్రతిసంవత్సమునందుఁ గప్పములు గట్టుచున్నాఁడవు. నీవు నాయాజ్ఞం బాలింతువేని నిఁక ముఁదు స్వతంత్రుఁడవై యుండఁగలవు. అంతేకాదు; నిషధసామ్రా జ్యము నీహస్తగతము కాఁగలదు నీవు సార్వభౌముఁడవై నలునివలె సర్వసుఖముల నొందఁగలవు. ఏమందువు? అనఁగా—పుష్కరుండాశా

పాశబద్ధుఁడై యిట్లనెను. "మహాత్మా! సూర్యపుత్త్రా! నాకపకారము గలుగకున్న మీరు చెప్పినచొప్పున దప్పక వర్తింతును." అనెను. అంత శనైశ్చరుఁడు సంతసించి యిట్లనెను. "పుష్కరా! నీకు భయము లేదు. నిరపాయంబగు నుపాయంబుచేతనే నీవు సామ్రాజ్యాధిపతివి కాఁగలవు. నేను వరించి పెండ్లాడనున్న దమయంతి నానలుండు పెండ్లాడినాఁడు. అనఁగా నాసామర్థ్యమును లెక్కచేయక, నన్నుఁ దృణీకరించిన వాఁడాయెను. కనుక నారాజన్యుని బదభ్రష్టునిఁ గావించి, కడగండ్లపాల్జేసి, భార్యతోడి వియోగమును గలిగింపవలయునని యూహించుచున్నాను. వినుము. నీవు నలుని జూదమాడఁ బిలువుము. నేను నీపాచికలందుఁ బ్రవేశించి నీకు జయమును, వాని కపజయమును గలుగునటులఁ జేసెదను." అని యాతని నొడంబడఁజేసి, నిషధకుఁ దోడ్కొని వచ్చి యందుఁ దానంతర్హితరూపముతోనుండెను; నిండుకొలువై యున్న నలసార్వభౌముని గనుఁగొని పుష్కరుండు హస్తములు మోడ్చి, భక్తిపూర్వక ప్రణామ మాచరించి, యాతనిచే ననుజ్ఞాతుఁడై యుచితాసనమున నుపవిష్టుఁడై యిట్లనెను. "సార్వభౌమా! మీతో వినోదార్థము జూదమాడవలెనని తద్దయుం బెద్దకాలమునుండి నాకభిలాషమున్నది. జూదము ఉత్తమ క్షత్త్రియధర్మము గనుక, మీరు మనసునందు సందేహింపక, నావాంఛను నెఱవేర్పుఁడు." నలుండు పుష్కరుని నోటినుండి వెలువడిన పలుకులాలకించి, క్షణకాల మాలోచన మభినయించి తరువాత నిట్లనెను. "పుష్కరా! జూదము సప్తవ్యసనములలో నొక్కటికదా! జూదమువలన ముప్పుదప్పదు. అట్లయ్యు నీవు కోరి నన్నుఁ బిలుచుచున్నావు. జూదమునకుఁగాని యుద్ధమునకుఁ గాని, పిలిచినపుడు క్షత్త్రియవంశ సంజాతుఁడగువాఁడు వెనుదీయఁ గూడదు. కాఁబట్టి నేను నీకు మాఱాడఁజాలను." పుష్కరుండును శనైశ్చరునివలనఁ దనకుఁ గలుగఁబోవు మహాభాగ్యమును దలఁచుకొని

లోలోన సంతసించి, " ప్రభూ! మీరు నాముద్దు చెల్లింపుఁడు. వినోదార్థమాడనున్న ద్యూతమువలన నెట్టి ముప్పును గలుగదు." అని నుడివి నలుని సమ్మతింపఁ జేసెను.

## — నలుఁడు పుష్కరునితో జూదమాడుట. —

నలుండు మంత్రి పురోహిత సామంతాదుల వీడ్కొలిపి భవనాంతర్భాగమునకరిగి రత్నమణిమయమగు తివాసియందుఁ గూరుచుండెను. ఆతని కెదురుగా పుష్కరుండు కూరుచుండి పాచికలొడ్డెను. ఆసమయమున శనైశ్చరుఁడు పుష్కరుని పాచికలలోఁ బ్రవేశించి యతినికి జయమును, నలున కపజయమును గలుగునట్లు చేయుచుండెను. నలుండు తొలుఁదొల్త మెడలోని ముత్యాలహారమును బన్నిదముగా నొడ్డి యోడెను; ఆపిమ్మట హస్తములందలి కడియములొడ్డి యోడెను; ఆవెనుకఁ జంద్రహారమును, ఆపిదప భుజకీర్తులను, ఆతదుపరి కిరీటమును బన్నిదములుగా నొడ్డి యోడిపోయెను. పురజనులీ వృత్తాంత మాలకించి చింతాక్రాంత మనస్కులై సత్వరముగ నగరుం బ్రవేశించి, జూదమాడుచున్న నలుసింగని, " ప్రభూ! జూదము సర్వానర్థకారణము. తామెఱుంగని ధర్మములు లేవు. భృత్యులమగు మేము దేవర కెఱిఁగింపవలసిన హితవొండు లేదు. ఇప్పట్టున నయిన నీకార్యమునుండి తమరు విముఖులు గావలయునని మేము వినయపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాము." అనిరి. కాని, శనైశ్చరుని ప్రభావమువలన నలునకు వారి హితవాక్యములు చెవులఁ జొరలేదు. ఆతఁడు వారి మాటలను సరకుగొనక, "మీదాఁటిని మీరు పొండని మందలించెను." తమ ప్రభుని నోట నెన్నఁడు నట్టిమాట వినఁబడకపోవుటచేతను, ఆమహాత్మునికి జూదాభిలాష యంతకుఁబూర్వము లేకున్నను, అప్పుడు మెండగుటచేతను నదియంతయును దైవసంకల్పమని పౌరులు తలంచి

ప్రభుని కేమాపదయుఁ గలుగకుండఁ జేయుమని దైవమును బ్రార్థించుచుఁ దమతమ నెలవులకుం జనిరి.

— దమయంతి బిడ్డలను విదర్భకుఁ బంపుట. —

పురజనుల హితవాక్యముల నొల్లక, తనవిభుండు పుష్కరునితో జూదమాడుచుండెననియు సర్వస్వ మోడుచుండెననియుఁ దెలిసికొని దమయంతి, కాలము వక్రగతిని బూనినదనియును, ముందేమి ముప్పురానున్నదో తెలియఁబడదనియును దలంచి, రథసారథి నొకని బిలిచి తన కూర్మిబిడ్డల నొప్పగించి బహుభద్రముగా వీరిని విదర్భకుఁ దీసికొనిపోయి తాతగారియింట విడిచిరమ్మని పంపెను. సారథియు దేవిగారి యాజ్ఞను శిరసావహించి యుత్తమాజానేయంబులఁ బూన్చిన కనకస్యందనంబున నాబిడ్డలను గూరుచుండఁబెట్టుకొని వాయువేగ మనోవేగములను మించిన వేగముతో విదర్భను జేరుకొని భీమరాజునకు వారి నొప్పగించి, నిషధలోని పరిస్థితులెల్లఁ దేటతెల్లముగఁజెప్పి, నిషధకు మరలి వచ్చెను.

— నలుండు దనసర్వస్వమును పుష్కరున కోడుట —

ఇట నిషధలో నలుండు జూదసమయమునఁ గ్రమక్రమముగాఁ దనభాగ్యములన్నియు నోడిపోయెను. రాజ్యమును గోబ్రాహ్మణ దేవతల కొసంగిన మడిమాన్యాదులుదక్క దక్కిన యావద్భూభాగమును ఓడిపోయెను; ఆభరణములోడిపోయెను. అంతఁ బుష్కరుండు మదాంధుఁడై, "నలుఁడా! నీవు రాజ్యము నోడిపోయితివి. ఇందు నిలుచుటకు నీకధికారములేదు. కావునఁ గట్టుబట్టలతోను, భార్యతోను ఈనగరమును విడిచి యీక్షణమందే పొమ్ము" అనెను. నలుండు మాఱు మాటాడఁజాలకపోయెను. అమ్మహాత్ముఁ డంతిపురికేఁగి బాష్ప

పూరిత నయనములతో దమయంతి యెదుట నిలువఁబడెను. ఆమెయు మాఱుమాటాడక, పట్టుచీరలను, నగలనుదీసివైచి, భర్తతో బయలు దేరెను. నలదమయంతులు పురత్యాగము సేయుసమయమున రాజ్యము నందలి పిన్నలు, పెద్దలు, వృద్ధులు, స్త్రీలు, పశుపక్ష్యాదులు, ఉద్యోగులు, వీరు వారననేల ? ప్రాణికోటులన్నియును వల్లిదండ్రుల నెడఁ బాయురీతిని గోలున నేడ్వఁదొడంగెను. " ప్రభూ ! మేమీనగరము నందుండము. మీతోఁగూడ వనములకే తెంతు " మనఁగా, నలుండు వారి నూఱడించి, " మీరు మీమీనెలవులయందే యుండవలయును. పుష్కరుండు మిమ్ములను దయార్ద్రచిత్తుఁడై పాలింపఁగలఁడు. మీ కే కొఱంతయుఁ గలుగకుండఁ జూడఁగలఁడు ". అని వారిని వీడ్కొని భార్యతో నడవులకుఁ బయనమయ్యెను.

— నలదమయంతు లడవికిఁ బోవుట. —

నలుండు దమయంతీ సమేతంబుగ దుర్గమారణ్యంబుల ప్రవేశించి పోవుచుండెను ; ఆతని హృదయము చింతాక్రాంతమై కడుంగడు భారమునఁ గ్రుంగిపోవుచున్నది. ఎండ కన్నెఱుంగని తనయిల్లాలు కంటకాన్వితమగు కటికినేలపై బహుకష్టముతో నడుగిడుచున్నదని గ్రహించుటతోనే యాతని నేత్రము లశ్రుపూరితములయినవి. ఆరీతి నాదంపతులు రెండుమూఁడుదినము లహోరాత్రములు నిరాహారులై నడచిరి. కాని, తినుటకన్నములేదు. క్షుద్బాధ దుస్సహమయినది. త్రాగుటకుఁ బుడిసెడునీరమయిన లేదు. అపుడు నలుఁడు దమయంతీ దేవి నుద్దేశించి యిట్లు చింతింపఁదొడఁగెను. " అక్కటా ! హృదయేశ్వరీ ! హంసతూలికాతల్పములందు శయనించెడిదానవు ; ఇష్టమృష్టాన్నములు భుజించెడిదానవు ; చీనచీనాంబరములు ధరించెడిదానవు ; దాసదాసీజనములచే నూడిగములు బొందుచుండెడిదానవు ; దివ్యదుర్ల

భములగు సమస్తభోగము లనుభవించెడిదానవు. అట్టి నీవీనాఁడు—ఈ పాపాత్మునిమూలమున నడవులపాలయితివిగదా! అయ్యయ్యో! ఈ యరణ్యమునందు నీకుఁ దినుట కన్నములేదు. త్రాగుటకు నీరము లేదు. కట్టుటకు మాఱువస్త్రములేదు. భయంకర క్రూరమృగములు దక్క నిందుఁబిలిచినఁ బలుకువారెవ్వరును లేరు. నాఁడింద్రాగ్నియమ వరులయిన దిక్పతులు కోరివచ్చినపుడు వారింగాదని నన్నుఁ బెండ్లి యాడినందువలనఁగదా నీకీ యగచాట్లు వాటిల్లినవి? హా! ఇఁకఁ గర్తవ్య మేమి? అవివేకినగు నావలన నీకిఁకఁ గష్టములేకాని, సుఖము రవ్వం తయినఁ గలుగఁబోదుకదా!” తన ప్రాణేశ్వరుఁడు ధైర్యమును గోల్పోయి, ప్రకృతదీనావస్థను దలంచుకొని పెల్లుదురపిల్లుచుండుటం గని, దమయంతీదేవి యిట్లనెను. “ప్రాణనాథా! సమస్తధర్మము లెఱింగిన పుణ్యాత్ములరు మీరు. మీకుఁజెప్పవలసిన హితమేమున్నది? సర్వజగన్నియామకుండగు సర్వేశ్వరుండయిన విధివిధానమును గడువఁ జాలఁడు. కైలాసవాసుఁడు కుబేరునంతటి ధనికునిఁ జెలికానిగాఁ బడ సియుఁ దాను పుఱ్ఱెను జేతఁబూని తిరిపెమునెత్తికొనుచున్నాఁడు; పెనువల్లకాటఁ గాపురమున్నాఁడు. త్రిమూర్తులే కర్మఫలము నవశ్య మనుభవించుచుండఁగాఁ దక్కుంగలవారి మాట చెప్పనేల? ప్రభూ! కష్టములెన్నటికిని గాపురమునేయవు. దేవేంద్రుఁ డెన్నిపర్యాయములు రాక్షసులచేత నమరావతినుండి తఱుమఁబడలేదు? తదుపరి శ్రీమన్నా రాయణుని యనుగ్రహమువలనఁ జింతామణీభద్రపీఠమునఁ జొన్పోందలేదు. సుఖమో, కష్టమో, ఏకాలమున నేదియనుభవింపవలసియున్న దో, దాని ననుభవింపక తప్పదుగదా! సర్వవిషయము లెఱింగియుఁ బామరుని చందమున నిపుడు వగవనేల? చీనిచీనాంబరములు లేవనియు, సుందరమందిరములు లేవనియు, హృద్యోద్యానవనములు లేవనియు, షడ్రసోపేతములగు భక్ష్యములులేవనియు నాకు విచారములేదు.

నాథా ! నాకు దమనన్నిధిని సుఖమనుభవించినను, కష్టమనుభవించినను సమభావమే కుదిరియుండును. నాకొఱకు కావంతయును విచారింపఁదగదు. గతవిషయములను మాటిమాటికినిజ్ఞప్తికిఁ దెచ్చుకొనియు విచారింపఁ దగదు. శ్రీమన్నారాయణానుగ్రహమువలన మనకష్టము లెన్నటికయినఁ బోవును ; సుఖములు కలుగును ; కనుక ధైర్యమవలంబింపుఁడు ; విచారముమనుఁడు ". ఈ ప్రకారము ధర్మబద్ధములును, ప్రశంసా పాత్రములును, అతి పవిత్రములును అగు వాక్యములచేఁ జిత్తవైకల్యము నడంచిన భార్యయొక్క సాధ్వీత్వమునకును, సౌశీల్యమునకును, విశేషజ్ఞానమునకును సంతసించి నలసార్వభౌముండామెతోఁగూడ నాయడవింబడి కొంతదూరము పోయెను. నాఁటికి నిషధరాజ్యమును విడిచి మూఁడుదినములు గడచెను. ప్రయాణపు బడలిక విశేషముగా నుండుటవలనను, ఎండవేఁడిమి తీక్ష్ణమగుటవలనను, నలదమయంతు లిరువురు నాయడవియందొక చెట్టుక్రిందఁ గూర్చుండిరి. అంతలో శనైశ్చరునిచేఁ బ్రేరేపింపఁబడి యాతనిభృత్యులు రాజహంసలరూపములఁ గైకొని, నలదమయంతులు విశ్రమించుచున్న వృక్షమునొద్దకు వచ్చి వ్రాలిరి. ఆ యంచల సోయగమునకు దమయంతి యక్కజమొందెను. నలుండును వానిలో నొకదానినయినఁ బట్టుకొని తన ప్రియురాలి కీయవలయునన్న తలంపుతో లేచి మెల్లన వానికడకు నడుగులిడెను ; అవియు నలునిఁ దమదగ్గఱకు రానిచ్చి యావెనుక నాతనికి దొరకనున్నట్లుగా నటించి, పిమ్మట హఠాత్తుగా నాతని భుజమునందున్న యుత్తరీయమును నోటఁగఱచికొని మింటికెగసి నిజరూపములతో సాక్షాత్కరించి, " ఓ నలమహారాజా ! మమ్ములను రాజహంసలుగా నీవు భ్రమించితివి. మేము రాజహంసలముగాము. కలిపురుషుని సేవకులము. నిన్ను వస్త్రవిహీనునిగాఁ జేయవలసినదని మా ప్రభువాజ్ఞాపించుటవలన నీరూపములతో నీ మ్రోలఁ బ్రత్యక్షమయితిమి. మాపని ముగిసినది. మేము పోవుచున్నాము. కాని మా

తుదివాక్యము నాలకింపుము. నీవు ధర్మాత్ముండవు. నీకెన్నఁటికయిన విజయముతప్పదు. ధైర్యలక్ష్మినిమాత్రము విడువకుండుము." అని నుడివి నిర్గమించెను. పాపము ! నలుండేమి చేయఁగలడు ? ఉత్తరీయ మును గోల్పోయి భార్యకావృత్తాంతమెల్ల వినిపించి ఖిన్నుఁడైయుం డఁగా, "నాథా ! వెంగను విడనాడుఁడ"ని యామె తన చీర నాత నిపైఁ గప్పెను. అప్పుడు నలమహారాజునకుఁ గన్నీరు కాల్వలై ప్రవ హింపసాఁగెను. ఆతఁడు దమయంతి హస్తమునందుఁ దన హస్తముంచి యామె భుజముపైఁ దన మోమానుకొని గద్గదస్వరముతో నిట్లనెను. "ప్రాణేశ్వరీ ! నీవు నాయందు నెవ్విధమునను సుఖమనుభవింపలేవు. నన్నుమాని యేసామాన్యరాజపుత్రుని జేపట్టినను, నీకిట్టి యిక్కట్లు గలుగవుకదా ! కానిమ్ము. గతించినదానికొఱకు వగవనేల ? ఇఁకముందు నామాటను బాటించి నీవొకపనిం జేయవలయును ; కాదనఁగూడదు. నీవు విదర్భయందు నీతల్లిదండ్రులను జేరుకొని బిడ్డలను గండ్లవేడుకగాఁ జూచుకొనుచు సుఖింపవలయును. నేనీమాటను అంతఃకరణపూర్వక ముగాఁ జెప్పుచున్నాను. నీక్షేమమే నాక్షేమము. నీసౌఖ్యమే నాసౌఖ్య ము. ప్రాణప్రియా ! నన్నొంటిగా విడిచి వెళ్ళుటకు నీవు సంకోచింపఁ బనిలేదు. నీయవస్థను జూడలేక, త్రికరణములచేతను, సర్వదా నీమేలుం గోరినవాఁడనగుటచేత నిక్కార్యమునకు నిన్నుఁ బ్రేరేపించుచున్నాఁడనే కాని వేఱుహేతువు చేతఁగాదు. మీరు మాత్రము నాతండ్రిదేశము నకువచ్చి సుఖింపరాదాయని నీవు నన్నుఁ బ్రశ్నింతువేమో ! ఆప్రశ్న ము యుక్తమయినదికాదు. సంపదలనుబాసిన పిమ్మట నీచస్థితియందున్న ప్పుడు బుద్ధిమంతులు బంధువుల యిండ్లకేఁగరాదు. చతురంగబలముల తోడను, మంత్రులతోడను, పురోహితులతోడను, వందిమాగధుల తోడను, ఏఁబదియాఱు గురుసామంతరాజులు బారులుదీరి శిరములవంచి మ్రొక్కుచుండఁగా విదర్భకేతెంచిన నలుండను నేను—ఇప్పట్లపదభ్రష్టు డనై—కట్టుటకొక్కగుడ్డయినలేక, పాదచారినై నీతల్లిదండ్రులమో

మెట్లు చూచెదను ? చూడలేను. భగవదనుగ్రహము కలిగినపిమ్మట నీకష్టములు గట్టెక్కిన మరల మన మిరువురము గలిసికొందము. అంత దనుక నీవు నాతోఁ బాటెండకు నెండి, వానకుఁ దడిసి, చలికి వడంక నేల ? పుట్టినింటికిఁబోయి కన్నబిడ్డలను గన్నులారఁగాంచుచు సుఖం బుండుము. పొమ్ము. నామాటకు మాఱునలుకకుము. విదర్భ దేశము నకుఁ బోవుమార్గ మిచ్చటి కనతిదూరముననేయున్నది. అచ్చటికి నిన్నుఁ గొనిపోయి విడిచిపుత్తును. ఎట్టులో మెల్లగానడచి కొలఁది దినములలో నానగరమును జేరుకొనుము." నలుఁడు పలికిన యీపలుకులు దమయంతీదేవికి సంతాపకరములయ్యెను. ఆమె హృదయము మొదలంటఁ జేతితో కెలకఁబడినట్లుకాగా కన్నుల నీరునించుచు నామె తనభర్తనుద్దేశించి యిట్లనెను. " ప్రాణేశ్వరా ! అర్ధాంగినగు నాకిట్టివియోగమును గల్పింపఁజూచుట మీకు న్యాయమా ? మీయండ నున్నప్పుడు కలుగు కష్టము నాకుఁ గష్టముగాక, వాంఛనీయమగు సుఖమేయగును. మిమ్ము లను విడిచియున్నప్పుడు కలుగు సుఖము త్యాజ్యమై మహాకష్టమగును. నాథా ! నన్ను మిమ్ములను విడిచియుండుమని గాటముగా బాధించు చున్నారు. మిమ్ములనువిడిచి యొక్కక్షణమయిన నేను బ్రదుకఁజాలను. భార్యయనునది నీడవలెఁ బెనిమిటి నెల్లవేళల ననుసరింపవలయునేగాని, కష్టములందుఁ బుట్టినింటికిఁ బాఱిపోఁదగదు. కనుక మీరు కష్టపడు చుండఁగా నేను మాతృగృహమున బంగారు తూగుటూయెలయందూగ నొల్లను ; మీరు అడవిలోఁ గాయలు, దుంపలు, ఆకులు మెక్కు చుండఁగా, నేను రుచికర భక్ష్యములను దిననొల్లను ; మీరు కట్టుబట్ట లేక, కటికినేలపై మేనువాల్చఁగా నేను పూఁబాన్పుపైఁ బరుండి సుఖింపనొల్లను. నన్నుఁ బుట్టినింటికిఁబొమ్మని చెప్పవలదు." అనఁగా నలుఁడు మాఱుమాటాడకపోయెను. తరువాత భార్యతో నాతఁడు మరలఁ బయనమును సాగించెను. అదృశ్యరూపముతో మత్సరజాడ్యహతబుద్ధియగు శనైశ్చరుండును ఆదంపతులను వెన్నంటుచుండెను.

ఒకరితో నొకరు వారు కలిసియున్నంతవఱకు వారు కష్టసుఖములను సమభావముతోనే కైకొందురనియుఁ గలంగక ధైర్యముతో నుందు రనియు, వారిని మిక్కిలిగా బాధింపవలయునన్న నెట్టులయిన వియోగ మును గలిగింపవలయుననియు నాతఁడు దలంచెను. అట్టి తలంపుతో శనైశ్చరుండు నలుని చిత్తములోఁ బ్రవేశించెను. అది మొదలు నలుండు దనభార్య నాయడవిలో నొంటిగా విడిచిపోవలయునని తలంచు చుండెను. వారు పోవఁగాఁ బోవఁగా నొక్కచోట నాలుగు దాఱులు గనుపించినవి. అందొకటి విదర్భకును, మఱియొకటి యయోధ్యకును, దక్కిన రెండును, మఱిరెండు దేశములకును బోవును. అక్కడకుఁబోవు సరికి సూర్యాస్తమయమాయెను; సందెచీఁకటులు నలుగడల నలము కొనుచున్నవి. ఇఁకముందునకు సాఁగిపోవుట కారాత్రి సమయమున మార్గముఁ గనఁబడదనినుడివి నలుండు ప్రయాణమును విరమించి భార్యతోఁగూడ నొక చెట్టుక్రింద విశ్రమించెను. దమయంతి విశేష శ్రమవలన మిక్కిలియు నలసి యచిరకాలములోనే గాఢముగా నిద్రించెను. అపుడు నలుఁడు శనైశ్చరుని ప్రభావమువలన నామెను విడిచి పోఁదలంచెను.

## — నలుఁడు దమయంతిని విడిచిపోవుట. —

కాని యాతని మనసునందు వివిధములగు నభిప్రాయములు పొడసూపినవి. ఆనట్టడవియం దొంటిగా నాయబల నర్ధరాత్రమున విడిచిపెట్టి తానెక్కడికయినఁ బోయినయెడల నేక్రూర జంతువైన నామెకు హాని గలిగించునోమోయని యాతఁడు భయపడెను. ఆసమయ మందామెను విడిచిపోకున్నఁ దన్నామెను విడిచియుండదనియుఁ దనతో నున్నయెడలఁ గష్టములు తప్పవనియుఁ దానప్పట్లు విడిచిపోయినయెడల నుదయమయినవెనుక మెల్లగా నిద్రనుండి మేల్కాంచి, తన్నుఁగానక,

కొంతతడవు వెదకి విచారించినను, దరువాత నేదోయొక దాటినిబట్టి యేదోయొక దేశమునకు ముందుగాఁబోయి తరువాతఁ గొంతకాలము నకుఁ బుట్టినింటికిఁబోయి కన్నబిడ్డలను గన్నులారఁగాంచుచు సుఖింపఁ గలదనియు నెంచెను. ఆయూహతో నామె నక్కడవిడిచి పోఁదొడం గెను. పాపమా మహారాజున కుత్తరీయములేదు. అప్పుడు దమయంతీ దేవియొక్క పైఁట కొంగునుండి నాలుగుమూరల చీరగుడ్డనుజించిఁ పైన నుత్తరీయముగ వేసికొని, ఆమె ముఖారవిందము నవలోకించెను. అతిమనోహరమగు నాముఖమును గలువఱేకులంబోలిన కనులనుజూచి, కన్నుల నీరు నించుచు, "హా! ప్రాణేశ్వరీ! నేను నిన్నుఁ ద్రిక రణశుద్ధిగాఁ బ్రేమించితిని. నీవును నన్నుఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రేమించి పెండ్లాడితివి. కాని యేమిలాభము మన ప్రేమ యీ విధముగా పరిణమించినది. ఈరీతిని గష్టము లొందుటకే నీవు నన్నుఁ బెండ్లియాడితివి. నేను నిన్ను విడిచి పోవుచున్నానని నన్ను దూషిం పకుము. నేను కనఁబడకున్న యెడలఁ బుట్టినింటికి వెళ్ళి, హాయిగా సుఖింతువనియే నేనీ వియోగమును గల్పించుచున్నాను. నన్నుఁ బాషాణ హృదయునిగాఁ దలంపకుము." అని యామె చెక్కిలి ముద్దుగొని విడువ లేక, విడువలేక, నాలుగడుగులు నడచి యామెను జూచుచుఁ బోవు టకుఁ గాళ్ళు రాక, అచ్చటనే నిలువఁబడి, కొంతతడవు విచారించి మరల శనైశ్చరుని ప్రభావమువలన ధైర్యము దెచ్చుకొని, మరలఁ బ్రేమభరంబున నామెయొద్దకేఁగి, చెక్కిలి ముద్దాడి యామె నిప్పట్ల నీఘోరారణ్యమున విడిచి యెట్లుపోదునాయని సందేహించి, మరల నానిముషమందే యాసందేహమును దొలఁగించుకొని, ధైర్యమవలం బించుచు నమ్మహారాజు, చివరకు కలిపురుషుని ప్రభావమువలన మన మునబాషాణ సదృశము గావించెను. అంజలిమోడ్చి, భగవంతుని ధ్యానించుచు," ఓ పరమేశ్వరా! ఆపద్బాంధవా! అనాథ రక్షకా! దిక్కులేని వారలకు దిక్కయినవాఁడా! అన్నెపున్నము లెఱుంగని

అమాయకురాలిని నాయర్ధాంగిని, నాబహిః ప్రాణమును, నట్టడవిలో భయంకరమృగ సందోహముమధ్య నొంటిగా విడిచి పోవుచున్నాను. ఆమెను రక్షించుభారమునీయది. ఈవిపత్సాగరమునుండి యామెను దాటించి, మెల్లఁగా విదర్భకుఁగొంపోయి పుట్టినింటఁజేర్పుము. తండ్రీ! నలుండొనరించినది దుష్కార్యమని ముందు యుగంబులందలి పురుషులు దూషింపకుండునట్లుగాఁ నాహృదయమును వారికి వ్యక్తముసేయుము. ప్రాణములకంటె నెక్కుడయిన యీయిల్లాలిని గేవల మీయామె మేలు గోరియే నే నెడబాయుచున్నాను; నేను గనఁబడకున్నచోఁ బుట్టినిల్లు జేరుకొని సుఖింపఁగలదని యూహించుచున్నాను. నా యూశయమును లోకమెఱింగి నన్ను క్షమించునట్లుచేయుము.” అనిప్రార్థించి, యామెను విడువలేక, విడువలేక, విడిచి, చివరకొక యడవిదారినిబట్టి పోయెను.

## — నలుఁడు వికృతాకారుఁడగుట. —

భార్యాభర్తలకు వియోగము కల్పింపఁజాలినందులకు శనైశ్చరుఁడు తనలోఁ దానుప్పొంగుచు నలుండు పోవుచున్న యటవీమార్గమునుదహింపుమని యగ్నిహోత్రునిఁ బ్రోత్సహించెను. అగ్నియు శనైశ్చరుండు చెప్పినచొప్పున నాయడవియందొక్కచోటున నుత్పత్తియై పండుటాకులు కట్టెలు మున్నగువానిని దహించుచుఁ గ్రమక్రమముగాఁ దీక్ష్ణస్వరూపముఁగైకొని మహావృక్షములను దహింపఁగడఁగెను. ఆ సమయమున శనైశ్చరుని యనుమతంబునఁ గర్కోటకుఁడను సర్పరాజొక చెట్టుకొమ్మకు వ్రేలాడియుండెను. కొంతసేపటి కగ్నిజ్వాలలా వృక్షమూలమును జుట్టుముట్టెను. అప్పుడు నిద్రించుచున్న దమయంతీదేవిని విడిచిన నలమహారాజా దారిని బోవుచుండెను. కర్కోటకుండు భయప్రకంపితదేహుఁడై యెలుఁగెత్తి నలమహారాజునిం బిలిచి, “ఓ నల సార్వభౌమా! దీనజనావనా! రక్షింపుము. రక్షింపుము. నేను కర్కోట

కుండనువాఁడను; సర్పములకు రాజగువాఁడను; ఈ వృక్షాగ్రము నందుండఁగా ప్రజ్వలితాగ్నిజ్వాలలు దీనిని జుట్టుముట్టినవి. నన్నిప్పట్లు నీవు రక్షింపకున్న నీచిచ్చునంబడి మలమలమాడి మ్రగ్గి నశింతును. ఓ శరణాగతరక్షణపరాయణా! ఇనకులతిలకా! నీవంటి ధర్మాత్ముఁడీ పదునాల్గులోకములందును, భూతభవిష్యద్వర్తమానములందు లేఁడు. ప్రాణదాన మర్థించుచున్న నన్నుఁ బ్రోవుమ" ని దైన్యముఁతో వేఁడు కొనఁగా నమ్మహాత్ముండును కంపముట్టిపడ క్షణమయిన జాగుసేయుక, ముందు వెనుక లాలోచింపక యాపెనుమంటయం దుఱికి వృక్షాగ్రము నందున్న కర్కోటకుని బయటకుఁదీసి, ప్రాణములు రక్షించెను. అప్పుడా కర్కోటకుఁడు దనభయంకర విషదంష్ట్రలు గాటముగ నాటు కొనునట్లుగా నలమహారాజు మేనఁ గాటువేసెను; తోడనే యాతని మేనిచాఁయ మాఱిపోయెను; ముఖవర్చస్సుపోయెను; శరీరమంతయు విషయుక్తమై నల్లగామాడిపోయెను; నలుండు దన వికృతాకారము నకుఁ దానే యబ్బురమందుచుఁ దనభార్య విధినిగుఱించి చెప్పినపలు కులు జ్ఞప్తికిఁ దెచ్చుకొని యాకర్కోటకుని జూచి, "ఓ సర్పరాజా! ఇదేమి యన్యాయము? పెనుమంటలోఁబడి చావనున్నాఁడవు; ప్రాణ రక్షణార్థమై శరణనిపల్కినాఁడవు. శరణాగతరక్షణము క్షత్రియ ధర్మము. కనుక నీవు క్రూరబుద్ధివనియయిన గణింపక నేను నిన్నుద్ధరించితిని. ప్రాణదాతకుఁ బ్రాణహాని యెవ్వరయినఁ గల్పింతురా? కృతజ్ఞతకు మాఱుగా కృతఘ్నతచూపితి విదేటిచోద్యము? నీకీపాడుబుద్ధి కలుగుటకును నాకాలముయొక్క వక్రగతియే కారణమా?" యనెను. అపుడు కర్కోటకుఁడా నలమహారాజునకు భక్తిపూర్వకముగా నమస్కరించుచు, "ప్రభువా! నీవు విచారింపవలదు. శనైశ్చరుని యాజ్ఞచే నీధర్మమును బరీక్షింపఁదలఁచి నీకీయపకృతిని జేసితిని. కాని యీ యపకృతి నీకిప్పట్లు బాధాకరమయినను, మహోపకారమే కాఁ గలదు. నీవు నలుని రూపముతో నెచ్చటకుఁ బోవుటకును లజ్జింతువు;

యొచ్చుటకోపోఁగా, ఏరాజునో యాశ్రయించి బ్రదుకకున్న దినము లెట్లు గడచును? ఈ రూపుతో నెందుఁబోయినను నిన్నెవ్వరును గుర్తింపలేరు. దినముల వక్రభావము నశించువఱకు నీవీ వికృతాకారము తోను, మాఱుపేరుతోను ఇచ్ఛానుసారముగ మెలంగవచ్చును. తరువాతఁ దొంటిసౌందర్యము నెప్పుడు పొందఁదలంచిన నపుడు హృదయమునందు నన్ను ధ్యానింపుము. తోడనే నేనువచ్చి మరల నావిషమును నేను గైకొందును", అనెను. అనఁగా నలుండు మిక్కిలియు సంతసించెను. ఏది వచ్చినను మేలునకేయని యాతఁడు దలంచెను. కర్కోటకుండు దనకు మహోపకారమే కావించెనని యుప్పొంగుచుఁ మార్గమునను సరించి పోయి పోయి, ఋతుపర్ణమహారాజుచేఁ బాలింపఁబడుచున్న యయోధ్యానగరముం జేరుకొనెను.

## — దమయంతి నలునిఁగానక విలపించుట. —

ఓ ధర్మనందనా! ఇక దమయంతీదేవియొక్క వృత్తాంతమును వినుము. మఱునాఁడు సూర్యోదయమయినంతనే యామె మేల్కొనెను. తనపజ్జయందుఁ బ్రాణనాథునిగానక కొందలమందెను; కాల్యములు దీర్చికొనఁగోరి యెందయినఁ బోయియుండునేమోయని కొంతతడవు మిన్నకుండెను. కాని యెంతకును నలునిజాడ తెలియకపోవుటవలనఁ బలుసారులు గొంతెత్తి పిలిచెను. ఆయరణ్యమునందామెకు మాఱు పలుకు వారెవ్వరు? సూర్యుఁడు నడినెత్తిమీఁదికి వచ్చుచున్నను నలునిజాడ యామెకుఁ గనఁబడకుంటచేత, తత్తరపాటుతో లేచెను. అప్పుడామె చీరచెంగునుండి నాలుగుమూరల గుడ్డచించఁబడినట్లు స్పష్టమయినది. అదిచూచి తన నాథుఁడు దనతోఁ జెప్పకుండ నెందయిన నరిగెనేమోయన్న భయముతో నిటునటు పఱుగెత్తెను. ఎందునుగానక తుదకాతఁడు తన్నా నట్టడవిలో నొంటిగావిడిచిపెట్టి పోయినాఁడనియే

నిశ్చయించుకొని గొంతెత్తి వెక్కి వెక్కి యేడ్చుచు, "హా! ప్రాణనాథా! నీవు చెప్పినదానిని నేను విననందులకు నాకీశిక్షను విధించితివా! ఒక్క క్షణమయిన నీవియోగమును సహించి మనఁజాలని నాకిట్టి శిక్షను విధించుట న్యాయమయ్యెనా? నన్ను దిక్కులేని పక్షిగాఁజేసిపోవుట భావ్యమా? ప్రాణప్రియా! నీవే నాసర్వస్వమనియు నీయండనుండుటయే పరమాహ్లాదకరమనియు దలంచితినే! మనోవాక్కాయ కర్మములచేత నిన్నే దైవముగా భావించితినే! ప్రయాణపుబడలిక మూలమున గాఢనిద్రాముద్రితనై యుండఁగా నన్నువిడిచి పోయితివా? హా! ఇంద్రాది దిక్పతులనొల్లక నిన్నుఁ గామించినందులకు ఫలమాయిది! నీప్రాణాధికురాలినగు నన్ను విడిచిపోవుటకు నీకు గాళ్లెట్లువచ్చెను? అమ్మయు నబ్బయును, దిక్కును, మొక్కును, తోడును, నీడయును లేని నట్టడవిలో భయంకర క్రూరమృగములమధ్య విడిచిపోవుటకు నీమనసెట్టు లంగీకరించెను? నవ్యనవనీత సమానమగు నీహృదయము పాషాణమెట్లాయెను? వివాహమయినదిమొదలు నేఁటివఱకొక్క నిమేషమయిన మన మిరువుర మొకరినొకరెడఁబాసి యెఱుఁగమే!" అని తనలోఁదాననుకొనుచు మరల, అయ్యో! నేను పరమపూజ్యుండగు నా ప్రాణనాథుని దూషింపనేల? ఇది యాతని తప్పిదముకాదు. నానొసటి వ్రాలిట్లున్నది. భర్తృవియోగమునకు గురియయి దుర్భరకష్టములందుమని బ్రహ్మ మూఁడు పంక్తుల లిఖించియుండఁగా నెవరు దప్పింపఁగలరు? నా ప్రారబ్ధకర్మ మిట్లుండుటచేతనే నానాథున కట్టిబుద్ధి పుట్టినది. "బుద్ధిః కర్మానుసారిణీ" యను లోకోక్తి యున్నదికదా! నేన నిర్హేతుకముగా నాభర్తను దూషింపఁగూడదు. ఓభగవానుఁడా శ్రీమన్నారాయణుఁడా! అవజ్ఞతా దోషమువలన నేను నాప్రియుని నొవ్వనాడితిని ఆపాపమునుండి నన్నుద్ధరింపుము. అసహాయురాలినై యున్న నాకిపుడు కర్తవ్యమును బోధింపుము." అని వేడుకొనుచు

బలువిధములనామె దుఃఖించుచుండెను. మూర్తీభవించిన శోకదేవత యోయనునట్లున్న యాదమయంతీదేవినిజూచి పక్షులోదార్ప వచ్చినవి. మృగములు మేతమాని కన్నుల నీరునించుచు నామెకుఁ గలిగిన దుఃఖమునందుఁ బాల్గొనినవి; వనదేవత లూఱడిల్లు మూఱడిల్లుమన్నట్లు ప్రతిధ్వనులం బ్రకటించిరి. ఆమె తద్దయుం బెద్దపొద్దు దుఃఖించి దుఃఖించి యిఁక నక్కడనుండిన లాభములేదని బయలుదేఱిపోవుచు మార్గమధ్యమందుఁ గనఁబడిన చెట్టును, పుట్టను, కొండను, బండను, తాటిని, రప్పను, పక్షిని, జంతువును, వేయేల? ప్రకృతియందలి చేతనాచేతనముల నన్నిటిని "మీకు నలమహారాజు కనఁబడెనా? ఆ మహాత్ముని జాడలు నాకెఱిఁగింపరా? దయఁజూపరా?" అని జాలిగొల్పుచుఁ బ్రశ్నించుచుండెను. కాని యాయరణ్యరోదనము నిరర్థకమాయెను. ఎవ్వరును మాఱుపలుకకుండుటచేత నామె యింతింతనరాని దుఃఖభారముతో రూపందిన శోకదేవతయో యన తడఁబడుచున్న యడుగులతో గడగడవడఁకుచున్న దేహముతో వీడిన వేణితోఁ గాల్వలంబోలెఁ గన్నీరు ప్రవహించుచుండ సాఁగిపోవుచుండెను.

## దమయంతి కిరాతుని శపించుట.

శనైశ్చరునిచేఁ బ్రోత్సహింపఁబడిన యొక కొండచిలువ అరణ్యమధ్యమం దొకచోటున వెనుకపాటున వచ్చి యాదమయంతిని జుట్టుముట్టెను. ఆ పెనుపాము బారినుండి తప్పించుకొను వెరవు నూహింపఁ జాలక, యా సాధ్వి హాహాకారమొనరించుచు మొదలునఱికిన తరువువలె నేలంగూలెను. ఆ యార్తనాదము పరిసరసీమలోఁ బక్షులను వేటాడుచున్న యొకకిరాతుని చెవిలోఁ బడినది. తోడనే యాతఁడు విల్లమ్ములు, ఖడ్గము, బాకు, ఈటె మున్నగు ఆయుధములు దాల్చి శబ్దమేతెంచిన దిక్కుగుండ నడచివచ్చి దమయంతీదేవి పడియున్న స్థల

మును డాసెను. ఆమె పాముచేతc జుట్టcబడియుండుటc జూచి, జాగు సేయక త్వరితగతిని దానిని జెండాడి యామె ప్రాణములం గాపాడెను. అపుడు దమయంతి కొంతవడికిc దెప్పరిల్లి, జీడిగింజవంటి మేని చాయయు మృగచర్మధారణమును, ఎముకల మాలలను, గలిగి బలిష్ఠ మగు కాయముతో నతిభీషణాకారుcడై తనయెదుట నాయుధము లతో నిలువcబడియున్న యా కిరాతుcడే తనకుc బ్రాణదాన మొనరిం చెనని తెలిసికొని, "అన్నా! ఈ దీనురాలి నెందులకుc గాపాడితివి? ప్రాణదాన మొనరించుట పరమపుణ్యదాయకమగు పావనకర్మమగుట చేత నిన్నభినందింతును; అందులకు నీకు సర్వదా కృతజ్ఞురాలనై యుం దును. కాని నా ప్రస్తుతావస్థనుబట్టి చూడcగా మరణమే శ్రేయోదా యక మనిపించుచున్నది. అందుల కెందులకు రక్షించితివి తండ్రీ? అగును. నాకష్టములు నీవే మెఱుంగుదువు?" అని దమయంతి నుడువ నామెయొక్క మృదుమధురస్వరమును, అద్వితీయములగు సౌందర్య లావణ్యాదులను ఆకిరాతుcడు చాలసేపు ఱెప్పవాల్చక చూడసాగెను. చూడcగాc జూడcగా నట్టి యందకత్తె యేలోకమందును, ఏజాతియం దును లేదనియు నుండcబోదనియు నాతcడు నిశ్చయించుకొనెను. తోడనే వాని చిత్తప్రవృత్తి మాఱినది. వాని మనస్సునందుc గామ వికారముదయించినది. వాcడామెను జూచి మందహాసమొనరించుచు, వెఱ్ఱిమొఱ్ఱిచేష్టలు గనcబఱచుచు, "చిన్నదానా! నీవెవ్వరిదానవు? నీ పేరేమి? ఈయడవిలో నొంటిగాc జరియించుటకుc గారణమేమి?" అని ప్రశ్నించెను వానికి జనించిన దుర్బుద్ధి యిట్టిదని యెఱుంగక, దమయంతి సాదరముగ నాతనికిట్లు మాఱువలికెను "అన్నా! నేను విదర్భదేశమును పాలించు భీమరాజునకుc బ్రియపుత్రికను; నిషధ దేశమును పాలించు నలసార్వభౌముని నర్ధాంగిని. నాపేరు దమయంతి యందురు. నాభర్త విధివశంబున రాజ్యమును గోలుపోయి నన్ను

వెంటఁబెట్టుకొని యీ యడవికి వచ్చెను. నేను నిద్రించుచున్న సమయములో నన్ను విడిచి యాతఁ డెక్కడికో వెడలిపోయెను. నే నాతని కొఱకు విలపించుచు వెదకికొనుచురాఁగా నిచ్చోట నీపాము నన్నుఁ జుట్టినది. భర్తృవియోగముకంటె మరణమే మేలని నేను దీనివాతఁ బడి చావనుంటిని. ఇంతలో దయాళుండవగు నీవెందుండియో వచ్చి దీనిని జంపి నన్నుద్ధరించితివి. అయ్యా! ఇది నావృత్తాంతము. ప్రాణదాతవగు నిన్ను నేను మరువఁజాలను. ఎల్లకాలము నీకు నేను కృతజ్ఞురాలనై యుందును. ఇఁక నాకు సెలవిమ్ము. పోయివచ్చెదను.”

అనఁగాఁ గిరాతుఁ డామెకడ్డునిలిచి, “ఓ సుందరీ! ఆగుమాగుము. తొందరపడెదవేల? నీతో మాటలాడవలసియున్నది. నీభర్త యీ మహారణ్యములో నొంటిగా నిన్ను విడిచిపెట్టి వెళ్లెననికదా చెప్పుచున్నావు? నీయందనురాగములేని భర్తకొఱకు నీవింతగా దేవులాడ నేల? నామాట వినుము. నేను కిరాతప్రభుఁడను. అన్నిటను బహు సమర్థుఁడను. దొంగతనమునందును, దోపిడియందును నన్నుమించిన వారు లేరు; జూదమునందును, వేఁటయందును నన్ను గెల్చువారు లేరు—బోయపల్లెలోనివా రందఱును నాకును, నాయాలికిని దండములు వెట్టుచుఁ బడికాపుకాయుదురు. నాయింట మాంసమునకుఁ గొదువలేదు—కల్లునకుఁ గఱువులేదు. కాఁబట్టి నిన్ను వలచి కోరుచున్న నన్నుఁ బొందినయెడల సుఖింపఁగలవు. సందేహముడిగి నావెంట రమ్ము. నాయింటి పెత్తనమును నీకిచ్చివైచెదను. నాభార్యయు నీకు దాసియై నీవు చెప్పిన పనులెల్లఁ జేయఁగలదు. రమ్ము. నేను గాముని బారికిఁ జిక్కియున్నాఁడను. నిన్నుఁ జూచినది మొదలు మనసు మనసు వలె లేదు”. అనెను. దమయంతీదేవి యీ బోయని ధోరణికి ఆశ్చర్యచకితయయ్యెను; మీఁదుమిక్కిలి చెప్పనలవికానంత దుఃఖమును బొందుచు దైవమునుద్దేశించి, “హా! భగవంతా! ఎట్టి మాటలు

చెవిని బడుచున్నవి! నన్నుఁ జంపఁగూడదా! శూలములం బోలిన యీ పలుకులచేఁ బరితాపము నెక్కుడు చేయనేల? పతివియోగమే దుస్సహమైయుండఁగా మరల నీపీడయేమి? తండ్రీ! ఈసౌందర్యము నెందులకిచ్చితివి?" అని యా కిరాతుని జూచి, "అన్నా! నీవు ప్రాణదాన మొనరించి నన్నుఁ గృతజ్ఞురాలిఁగాఁ జేసితివి. కాని యిదే మన్యాయము? కానిమాటలచే నాహృదయమును గలంచుట ధర్మమా? నీవు కామోద్రిక్త చిత్తుఁడనయిన వేఱొకయువతిని బొం దుము. నన్ను నీకన్నబిడ్డగా భావించి విడువుము. దురభిప్రాయము దురితమునకు మూలము. పరపురుషునిఁ గన్నెత్తిచూడని పరమపతి వ్రతామణిని నేను. ప్రస్తుతము విధివశంబునఁ గష్టములపాలయి తహ తహపడుచున్నానని నీవు నన్నుఁ జులకనచేయఁదగదు." అని సామ వాక్యములచే వానిమనస్సు మరల్పఁజూచెను. పోఁగాలము దాపురిం చినవారికి నీతివాక్యములు చెవింజొరఁబడవు. దుష్టుఁడగు నాబోయఁడు మదోన్మత్తుఁడై యాదమయంతి నెట్టులయినఁ గవయఁగోరెను. అంతఁ బ్రాణము రక్షించినవాని ప్రాణము హరింపరాదని దమయంతీదేవి తద్దయుం బెద్దప్రొద్దు ప్రయత్నించెను. కాని వాఁడామెపైఁ బడనుం డఁగా నిఁక శాంతమువలనఁ బ్రయోజనములేదనియుఁ దన సతీత్వ మును గాపాడుకొనుట యవసరమనియును దలంచి దమయంతి కను లెఱ్ఱఁజేసి, "దుష్టా! పతివ్రతయగు స్త్రీ యలిగిన యెడల ముల్లోక ములుఁ దల్లడిల్లఁగలవు. అసహాయనగు నాయెడల నీవపచార మాచ రింపఁదలఁచిన నిన్ను శపింతును. నా తుదిమాట నాలకించి, నీమనము నందలి దురుద్దేశమును విడువుము." అనెను. అప్పుడయిన నాబోయఁడు బుద్ధి తెచ్చుకొనలేదు; దుష్కార్యారంభము మానలేదు. పెద్దపెట్టున నవ్వి, కోఱమీసములు దువ్వి, "ఓ టక్కులాడీ! నీవు నన్ను శపిం తువా? కానిమ్ము. నిన్ను నాబిగికౌఁగిటంజేర్చి సుఖింపఁగోరుచున్న

నాహృదయ మీ బెదరింపుమాటలకు వెనుకకుఁ బోదు". అని యామెపైఁ బడనుండెను. అపుడు దమయంతి కోపముచేఁ దనూలత గడగడవడంక వాని నెర్ఱఁగాఁజూచి, "భర్తనే దైవముఁగా భావించు పరమ పతివ్రతామణిని నేనగుదునేని, నానాథుఁడు సద్గుణసంపన్నుఁడును, సదాచారరతుండును, లోకైకపూజ్యుండును నగునేని కామోద్రేకమున నన్నుఁ బొందఁగోరుచున్న పాపాత్ముఁడీ బోయఁడు దగ్ధమగుఁగాక!" యని శపించెను. ధర్మనందనా! పతివ్రతామణియొక్క వాక్కున కెందయినను దిరుగుండదుకదా! తోడనే యా కిరాతుఁడు దగ్ధదేహుఁడై నశించిపోయెను. అయ్యది కన్నులారఁ గాంచి వృద్ధిపొందిన వ్యాకులభావముతోఁ గాననంబునందున్న తరులను, గిరులను నలుని జాడలను గుఱించి ప్రశ్నించుచుఁ బోఁగాపోఁగాఁ దమయంతి కొక్కతావునఁ గొన్నిమున్యాశ్రమములు లోచనగోచరము లాయెను.

## —♦ మహర్షులు దమయంతికి ధైర్యము చెప్పుట. ♦—

దమయంతీదేవి ఆ యాశ్రమములను సమీపించి యందుఁ గృష్ణాజినంబులం దుపవిష్టులై యుండి తపస్సు చేసికొనుచున్న మహర్షులం గాంచి భక్తిపూర్వకముగాఁ బ్రణమిల్లి తన కులగోత్రాదికములను దన కప్పుడు కలిగిన కష్టములను విన్నవించెను. దయార్ద్రహృదయులగు మహర్షు లాసాధ్వీమణికిఁ గలిగిన కష్టముల కెంతయుఁ జింతించి, దివ్యదృష్టివలన నామెకును, భర్తయగు నలునకును గలిగిన యిక్కట్లకెల్ల శనైశ్చరుఁడే కారణభూతుఁడని గ్రహించి, యామెను జూచి యాదరమొప్పాఱ నిట్లనిరి. "అమ్మా! నీవు విచారింపఁబనిలేదు. మీదాంపత్య సౌఖ్యమును జూచి సహింపలేక శనైశ్చరుఁడు మత్సరజాడ్యహతబుద్ధియై మీకీ కడగండ్లెల్లఁ దెచ్చిపెట్టినాఁడు. ఇఁక మూఁడు సంవత్సరములలో మీబాధలు దీఱును; మీకుఁ దొంటి భోగభాగ్య

ములును, సామ్రాజ్య సౌఖ్యములును లభింపఁగలవు. శనైశ్చరుని దాష్ట్య మడఁగును ; మీఁదు మిక్కిలి యాతఁడే ప్రసన్నుఁడై మీకు వరము లీయఁగలఁడు. నీభర్తయగు నలమహారాజు—నిన్ను సదభిప్రాయముతోనే వనమధ్యమునందు విడిచి యెక్కడికో వెళ్ళిపోయినాఁడు. తనతోనుండి నీవు కష్టము లనుభవింపఁజాలవనియుఁ దాను లేకున్నఁ దిన్నగా విదర్భాపురి కేఁగి పుట్టింట సుఖింపఁ గలవనియుఁ దలంచియే నిన్ను విడిచిపెట్ట సాహసించినాఁడు. అందులకు మిక్కిలిగా నీవు విచారింపఁ బనిలేదు. మీవియోగమునకు దైవసంకల్పము కారణముగాక, శనైశ్చరునిసంకల్పమే కారణమగుటవలన మూఁడుసంవత్సములుదాఁటిన పిమ్మట మరల మీరిరువురును గలిసికొని హాయిగా బ్రదుకఁగలరు.” దమయంతి కాపలుకు లమృతోపమానను లయినవి. ఆమె కొంతకాలమువఱకు నామహర్షుల యాశ్రమములయందే కాలము గడపెను ; భక్తివిశ్వాసములతో వారికి శుశ్రూషచేసి వారి యాశీస్సులందెను. తరువాత దమయంతి యొకనాఁటి రేయి కొందఱు వర్తకులు సుబాహు మహారాజుచేఁ బాలితంబగుచున్న దేశమునకుఁ బోవుచుండఁగా, వారి వెనువెంట బయలుదేరి కతిపయ దినంబుల కాదేశమున్ జేరెను.

—దమయంతి సుబాహు నంతఃపురమున సైరంధ్రియై యుండుట.—

ఆమె రాజధానీ నగరముం బ్రవేశించి రాజవీధిం బడిపోవుచుండెను. ఆసమయమునందు మహోన్నత సౌధరాజములందు నిలువఁబడి స్త్రీ లామెను జూచి యట్టి లోకోత్తర సౌందర్యవతి పదునాల్గు లోకములందుండదని, తమలోఁదాము—“ అక్కా! చూచితివే! మన్మథునితో దెబ్బలాడి వచ్చిన రతీదేవియో, విష్ణుమూర్తితోఁ దగవులాడి వచ్చిన శ్రీమహాలక్ష్మియో, మేఘమాలికనుండి విడివడిన మెఱుపుఁ దీఁగయో యనినట్లీ జగదేక సుందరి కనుల పండువొనరించు లావణ్య

ముతో నొప్పుచున్నది. ఈమెను జూడఁగా నొక మహారాజు గర్భమున జన్మించి యొక మహారాజుం జేపట్టిన మానినీమణివలె నున్నది కాని సామాన్య యువతిగాఁ దోఁచుటలేదు." అని యొకరితో నొకరు చెప్పుకొనఁ దొడంగిరి. అంత శుద్ధాంతఃపురకాంతలు కొందఱు దాఁటిని బోవుచున్న దమయంతినిజూచి, యామె సౌందర్య లావణ్యాదుల కక్కజమంది, పరుగుపరుగునఁ దమ పట్టంపుదేవినొద్దకు నెడలి, "దేవీ! మూడుమూర్తుల మీావలెనున్న యొక జగదేకసుందరి రాజబాటంబడి పోవుచున్నది. ముఖలక్షణములంబట్టి చూడఁగా నొక సద్వంశసంజాత యగు మహాపతివ్రతయనుట ద్యోతకమగుచున్నది." అని చెప్పఁగా నామెయు సౌధోపరిభాగమునకునెక్కి క్రిందనున్న దమయంతినిజూచి, తటాలున దాదులను బంపి వారి మూలమున నామహాసాధ్విని దన యంతిపురికి రప్పించి, "అమ్మా! నీవెవ్వరవు? నీముఖలక్షణముల నరయఁగా సామాన్యురాలివి కావనుట విస్పష్టము; మఱియుఁ గష్ట దశయందున్నట్లును దోఁచెడిని. నీవృత్తాంతమును దెలుపుము." అనెను. అపుడు సుబాహు మహారాజు భార్యతో దమయంతి యిట్లనెను. "అమ్మా! ప్రస్తుతము నేనొక నిర్భాగ్యురాలిని. సైరంధ్రి యనఁబడువానను; ఇంతకంటె నావృత్తాంతమును గుఱించి యధికముగా నన్నుఁ బ్రశ్నింపవద్దు—నాభర్త వచ్చువఱకును, మర్యాదకును, ఆత్మగౌరవమునకును, కులాచారములకును, భంగము వాటిల్లని రీతి నెందయిన నుండఁదలంచుచుంటిని. నేను మిక్కిలి సొగసుగా జడవేసి పూలు తుఱిమి సింగారింపఁగలను; సైరంధ్రి చేయుపనులెల్ల నింతింతన రానినేర్పుతో నెఱవేర్తును. కాని పరపురుషులను గన్నెత్తిచూడనొల్లను; వారితో మాటలాడను; ఉచ్ఛిష్టమును దిన నంగీకరింపను; ఊడిగము సేయను; నీచాభిప్రాయములయందుగాని, నీచకార్యములయందుఁ గాని పాల్గొనఁజాలను." ఈమాట లాలకించిన పట్టపుదేవి హృదయ

మునందు ఆశ్చర్యము, అనురాగము, సంతోషము అనునవి మూప్పిరి గొనుచుండ దమయంతిని జూచి, "అమ్మా! గ్రహణకాలమున సూర్యుఁడు కాంతిం దొఱఁగునట్లుగా, నేదో యొక విపత్తునంబడి సహజమగు ధైర్యమును దొఱఁగియున్నావు. నీవు కోరినరీతిని నీమర్యాదకును, మానమునకును, నిష్ఠకును, నియమమునకును భంగము వాటిల్లకుండ, నేలమీఁద నడిపింపకుండ నిన్ను నేసాఁకఁగలను. కాఁబట్టి నీ వెందేఁగక మదీయాంతఃపురమునందే నివసింపవలెన" ని దమయంతీదేవిని సమ్మతింపఁజేయఁగా నామె నాఁటినుండియు సైరంధ్రీ నామముతో వ్యవహరింపఁబడుచు నచ్చోటననే నివసించుచుండెను.

## నలమహారాజు ఋతుపర్ణుని కొలువుం జేరుట.

ఓ ధర్మనందనా! అరణ్యమధ్యమునందు దమయంతీదేవి నొంటిగా విడిచిపుచ్చిన నలుఁడనుభవించిన కష్టములను దరువాతి కథను ఆలకింపుము. అయోధ్యానగరమును వికృతాకారముతోఁ జేరిన యమ్మహారాజు బాహుకుండను పేరితో ఋతుపర్ణునియొద్ద కరిగి, "ఆర్యపుత్రా! నేను బాహుకుఁడనువాఁడను; నలసార్వభౌముని రథసారథినై యింతకాల మేకొఱంతయులేక హాయిగా బ్రతుకఁగలిగితిని. అమ్మహారాజు తన రాజ్య సర్వస్వము పుష్కరునికోడి భార్యతో నడవుల పాలాయెఁగదా! కుత్సిత ప్రవర్తనుండయిన పుష్కరుని సేవించుట కిష్టములేక మీ యొద్దకు వచ్చినాఁడను. సారథ్యమున నాకు మిక్కిలియు నైపుణ్యముగలదు. వాయువేగ మనోవేగములను మించిన వేగముతో రథమును దోలఁగలను. ఎట్టి పెంకిగుఱ్ఱమునయినను లొంగఁదీయఁగలను. మఱియుఁ జక్కఁగా వంటచేయఁగలను. నేను వండిన వంటకములను మొరడుపై విదిమినఁజిగురును పెట్టి ఫల పుష్పములతో శోభిల్లును. వానిని ముదుసలులుదిన్న నవయౌవనముపొంది దర్శనీయా

కృతులతోఁ దనరుదురు. ఓ రాజా ! నీచకార్యములు చేయనొల్లను ; దూషణము నంగీకరింపను. గౌరవమునకుఁ గొదువలేని రీతిని నన్ను నీ సభయందుంచుకొనుము " అనెను. ఋతుపర్ణుఁడు చాలసేపు నలుని వికృత కృతిని బరికించెను ; పరికించి తనలోఁ దానే నవ్వుకొనెను. కాని యేపుట్టలో నేపామున్నదో నెవరికిని దెలియదనియుఁ జూపఱకాతఁడు రోఁత గలిగించుచున్ననుఁ మహా సమర్థుఁడు గావచ్చునని ఋతుపర్ణుఁడనుకొని నలునిఁ దనకొలువున నుంచుకొనెను. దమయంతీదేవియొక్క యాజ్ఞ చొప్పున బిడ్డల నిరువురను దాతగారయిన భీమరాజుగారి భవనమున విడిచిన సారధియు నయోధ్యకువచ్చి ఋతుపర్ణు మహారాజును సందర్శించి, " రాజా ! నేను శ్రీ నలమహారాజు కొలువున నుండెడివాఁడను. దురదృష్టవశమున మారాజు రాజ్యముం గోలుపోయి యడవుల పాలాయెను. నిషధ రాజ్యమును వంచనోపాయమున గ్రహించి పాలించుచున్న పుష్కరుని సేవించుట కిష్టపడక యుద్యోగమర్థించుచు నీయొద్దకువచ్చితిని. " అనెను. ఋతుపర్ణుఁ డాతనింగూడఁ దనయాస్థానమునందుద్యోగమిచ్చి యాదరించెను. ఆసారధి బాహుకునియొక్క అశ్వ శాస్త్రజ్ఞానమును, సారధ్య నైపుణ్యమును జూచి తనలోఁదానచ్చెర వొందుచు, " ఆహా ! ఈ మహాభాగ్యుఁడెవ్వఁడు ? చూచుట కసహ్యము గలిగించుచున్నను యుత్తమగుణ సంపన్నత్వముచే మారాజుం బోలియున్నవాఁడే ! ఈతనికిఁగల యశ్వశాస్త్ర పరిజ్ఞానము మా మహారాజునకుఁదప్ప నితరుల కెవ్వరికిని లేదు. " అని యనుకొనుచుండెను.

## — నలుండు దమయంతిని దలంచుకొని విలపించుట. —

ఓ ధర్మరాజా ! వినుము. ఈ ప్రకారముగా బాహుకుఁడను నామముతో వ్యవహరింపఁ బడుచున్న యా నలమహారాజు ఏకతంబున నున్నప్పుడెల్ల, దన యాలుబిడ్డలను దలంచుకొని విలపించు చుండెడి

వాఁడు. "ఓ ప్రాణప్రియా! ముక్కోటి దేవతలుచేతను మునిపెద్దా లందును మ్రొక్కులందు దేవేంద్రునంతటి మహాభాగుని గాదని నన్ను ప్రేమించి పెండ్లియాడినందులకు నీకెట్టి యిక్కట్టు గలిగినది! అయ్యయ్యో! గాఢనిద్రా పరవశవై యున్న నిన్ను అరణ్యమునవిడిచి వచ్చితినిగదా! నిద్రనుండి మేల్కాంచినపిమ్మట నాకొఱకెన్ని పర్యాయము లెలుఁగెత్తి పిలిచితివో! ఏయే ప్రదేశముల వెదకితివో! ఒంటిగా విడిచి చెప్పకుండఁబోయిన పాషాణహృదయుఁడని నెంతగా దూసించితివో! అక్కటా! ఏ భయంకర మృగమయిన నిన్నుఁ దన పొట్టంబెట్టికొనెనా! ఏ దుర్మార్గుఁడయిన నీకాపదను గలుగఁజేసెనా? నీవెందేఁగితివి? ఏయే కష్టముల ననుభవించుచుంటివి!...హా! విధీ! కోరి పెండ్లాడినందుల కా కోమలాంగికెట్టి బాధలు కల్పించితివయ్యా! బిడ్డలొక్కచోట! తా నొక్కచోట! భర్తయొక్కచోట! అయ్యయ్యో! ఆ చంద్రవదనను సురక్షితయై యుండఁగాఁ గాంచుభాగ్యమీ అభాగ్యున కెన్నఁడయిన లభించునా!" అని పరి పరి విధములఁ దలంచి దుఃఖించుచుండును. ఒక్కదినమున ఋతుపర్ణుఁడును, నలుని రథసారథియు నాతని దుఃఖమునుజూచి "బాహుకా! రహస్యముగా నీవు నిరంత మేదియో నీలో నీవు తలంచుకొని కన్నుల నీరు నించెదవు. నీ ముఖలక్షణములబట్టి చూడఁగా దారుణమగు మనఃక్లేశము ననుభవించుచున్నట్లు తెలియుచున్నది. నీ వెవరికొఱకువిలపించుచున్నావు.?" అని ప్రశ్నించిరి. "అయ్యలారా! ఈ భూమండలమున సుప్రసిద్ధుఁడగు నొక మహారాజు కలఁడు. నే నాతని కథను గుతూహలముతో నాలో నేను చెప్పుకొనుచుఁ దుఃఖించుచుందును. అంతియేకాని, వేఱు కారణములేదు." అని మారువలికి నలుండు వారిని సమాధానపఱచి యెప్పటియట్ల దినములు వెళ్ళఁబుచ్చుచుండెను.

## భీమమహారాజు నలదమయంతులను వెదుకఁబంపుట.

బిడ్డలను గొనివచ్చి యప్పగించినసారథి భీమ మహారాజునకు నలమహారాజునకుఁ గలిగిన విపత్తులను విస్తరించి చెప్పిననాఁటినుండియు నాతఁడు చింతాక్రాంత చిత్తుఁడాయెను. చారులను నిషధ దేశమునకుఁ బంపఁగా వారు వెళ్ళి పరిస్థితులెల్లఁ దెలిసికొనివచ్చి, నలదమయంతులు దేశమును విడిచి యడవుల పాలయిరనియు వారిజాడ లెవ్వరికిని దెలియఁబడకున్నవనియును జెప్పెను. ఆవార్త పిడుగుపాటయి హృదయమును గలంచఁగా, భీముఁడును, భార్యయగు కోకిలాదేవియు మూర్ఛ మునింగి శీతలోపచారములంగొని తెప్పరిల్లి, లేచి, మంత్రులనుబిలిచి, "అయ్యలారా! మా యేకైకపుత్రియగు దమయంతి కెట్టి కష్టములు మూడినవోకదా! మా యల్లుఁడేవి బాధలు పొందుచున్నాఁడోకదా! మా కొమరిత యొక్కయు నల్లుని యొక్కయు జాడలెఱింగించి, వారిని మా ముందుఁబెట్టకున్న మాకీ రాజ్యము వలదు. సుఖములు వలదు. భోగములు వలదు. ప్రాణ పరిత్యాగమే శరణ్యము." అని నుడివి విచారించుచుండిరి. అంతలోఁ బురోహితుండు కృష్ణ వర్ణుండను పేరుగల వేదాధ్యయ సంపన్నుఁడగు బ్రాహ్మణుఁడువచ్చి మంత్రులవలనఁ బ్రభుదంపతుల దుఃఖ హేతువుం దెలిసికొని, "రాజా! నీవు విచారముడిగి, యెల్లరను సమర్థులగువారిని నలదమయంతుల జాడం దెలిసికొనుట కెల్లదేశములకుఁ బంపుము. నేనుగూడ వారిని వెదకుటకుఁ బోవుచున్నాను. త్వరలోనే వారి జాడ నీకుఁ దెలిపి యీ దుఃఖమును బోఁగొట్టఁగలము. నీవు కొందలపాటు నుడుగుము. చిత్తస్వాస్థ్యమును గుదుర్చుకొనుము." అని సమర్థులగు చారులను నలదమయంతుల వెదకుటకు నానా దేశములకుఁ బంపి, తా నయోధ్యకుఁ వెడలెను.

## —♦ సుబాహుని భార్య దమయంతిని గుఱుతించుట.

నలదమయంతులను వెదుకఁబోయిన వారందఱును అంగ వంగ కళింగ కాశ్మీర ఘూర్జర నేపాళ కకుళాది దేశములను, అరణ్యములను, పర్వతములను, కోనలను, గృహాలను, చెట్లను, పుట్లను, ఆలయము లను, సత్రములను, జనపదములను, ఇవి యవి యననేల ? యెల్లతావు లను వెదకి వెదకి వ్యర్థులై వేసారి విదర్భకుఁ దిరిగివచ్చి భీమమహా రాజున కెఱిఁగించిరి. నలదమయంతుల జాడ తెలియఁబడలేదని భీముండు మిక్కిలియు దురపిల్లుచుండెను. కాని యయోధ్యానగరమున కరిగిన కృష్ణవర్ణుం డింకను రాకపోవుటవలనఁ గొంచె మాసవహించి యుండెను. తరువాత నాకృష్ణవర్ణుఁ డయోధ్యకరిగి యంతఃపురముం జేరి, సుబాహు రాజపత్నిని డాయఁబోయెను. ఆయమ భీమరాజ పత్నియగు కోకిలా దేవికి సహోదరియు, దమయంతీదేవికిఁ బినతల్లియు నగును. అందు వలన భీమరాజు కొలువునుండి వచ్చిన పురోహితునకు భక్తిపూర్వక ముగా నమస్కరించి, "ఓ మహాత్మా ! మా అక్కయు, బావయగు భీమ మహారాజును గుశలముగ నున్నవారా ! మా దమయంతియు నామె భర్తయు నిప్పుడెచ్చట నున్నారు ? వారి క్షేమవార్త తెలియు చుండుటలేదు. వారి బిడ్డలకు శుభమేకదా !" అని ప్రశ్నింపఁగా కృష్ణవర్ణుఁడు వృత్తాంతమెల్ల వినిపించి, నలదమయంతుల జాడం దెలిసి కొనుటకే తానటకు వచ్చితినని చెప్పెను. అంతలో, సైరంధ్రీయను పేర వ్యవహరింపఁబడుచున్న దమయంతి యచ్చటకు వచ్చెను. కృష్ణ వర్ణుం డామెను బరికించి చూచి, దమయంతియని గ్రహించి, సంతో షముంగొంది, "అమ్మా ! దమయంతీ ! ఇదేమి ? నీవిందే యుం టివా ?" యనెను. దమయంతియుఁ గృష్ణవర్ణుని గుఱుతుపట్టి, కన్నీరు మున్నీరుగాఁ గార్చుచు నాతని పాదములపైఁబడి "తండ్రీ ! నాతల్లి దండ్రులకును, అన్నయగు తపనాభికిని, బిడ్డలకును సేమమేకదా !

నా భర్త తోడనుండెనో, సేమముగనుండెనో లేదో, మీ కేమయినఁ దెలియునా ? ” యని గద్గదస్వరమునఁ బ్రశ్నింపఁగా, సుబాహు రాజ పత్ని వెంటనే యాసనమునుండి లేచి, దమయంతిని కౌఁగిలించుకొని, “ హా ! కుమారీ ! నీవా ! ఇన్నిదినంబులునుండియు మాయింటను మాచెంతనే మెలంగుచుంటివా ! యని కంటఁదడి బెట్టెను. అంతలో సుబాహుమహారాజుకూడ నక్కడికివచ్చి సైరంధ్రియే దమయంతి యని తెలిసికొని యాశ్చర్య సంతోషములం బొందెను. కృష్ణవర్ణుండును దమయంతిని జూచి, “ అమ్మా ! నీకొఱకును నీభర్తకొఱకును వెంగ గొని నీతల్లిదండ్రులును, అన్నయును నిద్రాహారములు మాని నిరంతర ఖేదమం బొందుచుండిరి. వారు పడుచున్న వ్యసనమును గన్నులతోఁ గాంచుటకు శక్యముగానిది. నీజాడను, నీ ప్రియుని జాడను దెలిసికొను టకుఁ బెక్కుమంది చారులు బయలుదేఱిరి. నేనయోధ్యకు వచ్చితిని. నాభాగ్యము దొడ్డది యగుటవలన నేను నిన్నుఁ గాంచఁ గలిగితిని. ” అని రాజదంపతులతో దమయంతీదేవిని వెంటనే సముచిత విధమున విదర్భకుఁ బంపవలెనని చెప్పి, వారికడ సెలవును గైకొని, తాను బయ లుదేఱి నలమహారాజు నన్వేషించుటకుఁ బోయెను. ఆపిమ్మట దమయం తీదేవి నొక బంగారు పల్లకియందుఁ గూర్చుండఁబెట్టి దాసదాసీజనముల నిచ్చి రథ గజ తురంగాదులను, ఆయుధపాణులగు భటులను తోడిచ్చి సుబాహుఁడు విదర్భకుఁ బంపెను. అట విదర్భలో దమయంతీదేవి రాక వలన భీమరాజు కోకిలదేవి, తపనాభి మున్నగువారు వర్ణనాతీతమగు సంతోషమును బొందిరి. కృష్ణవర్ణుఁ డొనరించిన మేలుం గొనియాడిరి. “ బిడ్డా ! ఇన్నిదినములనుండి నీవెక్కడెక్కడ నేయే పాట్లు పొందితి వమ్మా ! నీకేమి ప్రారబ్ధమమ్మా ! భర్తను వెంటఁబెట్టుకొని యిందు రాఁగూడదా ? నీకేమయినఁ గొఱత గలిగియుండునా ? అయ్యయ్యో ! మీజాడఁ దెలియక ప్రాణములఁ బోగొట్టుకొనుటకుఁగూడ మేము

సంసిద్ధుల మయితిమే!" అని వారు విచారించిరి. దమయంతియు వారి కందఱకును దగువిధంబున సమాధానమిచ్చి, రాత్రింబవళ్ళు అన్నము ముట్టక, కన్ను మూయక, కురులు దువ్వక, ఆభరణముల నొల్లక మాసిన చీర విడువక, "హా నాథా! నాథా!" యని పలవించుచు క్షణ మొక యుగముగాఁ గడపుచుండెను.

—• కృష్ణవర్ణుఁడు నలునితో సంభాషించుట. •—

నలుని వెదకఁబోయిన కృష్ణ వర్ణుఁడు వివిధ దేశములు చూచి చూచి, యెందును సఫలీకృత మనోరథుఁడు కాఁజాలక, చివరకు ఋతుపర్ణ మహారాజు పాలించుచున్న యయోధ్యకుఁ బోయెను. అక్కడి ప్రజలవలనఁ గ్రొత్తగా బాహుకుఁడనువాఁడు కొలువున నమరెననియుఁ బాకశాస్త్రమున వానికిఁగల ప్రావీణ్య మనుపమాన్యమనియు, అశ్వశాస్త్ర పరిజ్ఞానము వాని సొమ్మనియు నాలకించి, ఆశ్చర్య మొంది యాతని దర్శింపవలెనని తలంచెను. ఆ తలంపుతో బాహుకుని యొద్దకేఁగి యాతని వికృతాకారమునకుఁ గారణమేదియైయుండునా యనుకొని, "ఓయీ! నలమహారాజు పాషాణ హృదయుఁడుకదా! నీవు ఆతని కొలువున నెట్లుంటివ"ని యడిగెను. ఆ మాటలకు బాహుకుఁ డించుక కోపముఁజెంది, "బ్రాహ్మణుఁడా ఆ మహారాజు యొక్క గుణ గణములు నీవేమెఱుంగుదువు? ఆతఁడు పాషాణ హృదయుఁడుకాదు. దయార్ద్రచిత్తుఁడు." అనెను. అనఁగా కృష్ణవర్ణుఁడు తనలో నాతఁడే నలమహారాజై యుండుననియుఁ గారణాంతరముచేత నారూపుతో ఋతుపర్ణ మహారాజును సేవించుచున్నాఁడనియుఁదలంచి, "ఓయీ బాహుకా! నలమహారాజు దయార్ద్రచిత్తుడన్న లోకము నవ్వపోవును. దిక్పాలుంగాదని తన్నుఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రేమించి పెండ్లిగూడిన మహాసాధ్వి నడవిలోవిడిచి యొంటిగాఁ బోవుట దయార్ద్ర

హృదయుని స్వభావమా? ఇందుకు నీవేమి సమాధానమిత్తువు? అనెను. అంత నలుండు బ్రాహ్మణునవలోకించి, కన్నుల నీరు గ్రమ్ము చున్నను, వానిని మఱుఁగుపఱుపఁ బ్రయత్నించుచు, "ద్విజోత్తమా! తనతోనుండి యీ మగువ కాయకష్టముల కోర్వలేదనియుఁ దన్నక్కడ విడిచిపెట్టినఁ దా నెక్కడికయినఁబోయి, లేకున్న దల్లి దండ్రులయొద్దకే పోయి సుఖించుననియు నాతఁడట్లు కావించియుండెను. ఆతని చిత్త వృత్తిని దెలిసికొనకుండఁగనేఁ తొందరపడి నిందించుట న్యాయము గా" దనెను. నలుని నిందింపఁగా దాను సమర్థింపఁ జూచుటచేతను, విషాద భరమును వ్యక్తపఱచుటచేతను, ధీ సంపన్నుఁడగు కృష్ణ వర్ణుఁడు—ఆతఁడే నలుండనుట నిస్సందేహమని యెంచి, యాతని వీడ్కొని సత్వరమున విదర్భకుఁబోయి, భీమ మహారాజునకును, దమ యంతీదేవికిని నలుండు బాహుక నామముతో నయోధ్యాపతియయిన ఋతుపర్ణునియొద్ద సారథియై కుదిరియున్నాఁడని వచించి, తన తలంపు నకుఁగల కారణములెల్ల నెఱిఁగించెను. అవియన్నియును నుచితములై యుండుటవలన దమయంతీదేవియును విశ్వసించి తండ్రి పాదములపైఁ బడి "జనకా! నాభర్త నెటులయిన నాకడకు రప్పింపుము. ఆ మహా నీయునింజూడకున్నచో మేనఁబ్రాణములుండవు." అనెను. భీమమహా రాజామెతో నాలోచించి, దమయంతీదేవికి ద్వితీయ స్వయంవరమని ఋతుపర్ణ మహారాజునకొక్కనికి మాత్రమే యాహ్వాన మంపినచో నాతఁడు దప్పక వచ్చుననియుఁ నాతనివెంటనే సారథియైయున్న నలుండు వచ్చుననియు దమ యభీష్ట మీడేరఁగలదనియుఁ దలం చెను. తన తలంపున కనుగుణముగా నొక యాహ్వాన పత్రికను వ్రాసి, దానిని రహస్యముగా నొక యాశ్వికునిచేతికిచ్చి, "దీనిం గొని పోయి ఋతుపర్ణ మహారాజునకిచ్చి రమ్మ"ని పంపెను. ఆ యాశ్వి కుండును బహు వేగంబున నయోధ్యా దేశంబునకుఁబోయి, భీమ మహారాజిచ్చిన యాహ్వాన పత్రికను బాహుకుని చేతికిచ్చి దీనింగొని

పోయి శ్రీ ఋతుపర్ణ మహారాజుగారి కిమ్మనెను. బాహుకుఁడద్దానిని విప్పి చదివి యాశ్చర్య చకితుఁడాయెను. " హా ! దైవమా ! కాంత లను విశ్వశించుట మోసముగదా ! వారిని నమ్మువాఁడు మూఢుఁడు గదా ! దమయంతికిప్పుడు స్వయంవరమఁట ! అక్కటా ! ఈ వార్త నరసియు నా హృదయము శతధా భిన్నము గాకున్నదేల ? " అని తనలో తా నింతింతనరాని వంతంబొంది, దానిఁగొని శ్రీ ఋతుపర్ణ మహారాజు చేతికిచ్చి, విదర్భాధిపతియగు భీమరాజుగారు మీకడకుఁ బంపినారని నుడివెను.

## —• ఋతుపర్ణుఁడు విదర్భకు బయనమగుట. •—

అయోధ్యాపురాధీశుండగు ఋతుపర్ణమహారాజు దమయంతీ ద్వితీయస్వయంవర వృత్తాంత మాలకించి విదర్భకుపోవలెనని తలంచెను. కాని బహుదూర మందున్న యాపట్టణమున సకాలములో జేరుకొ నుట సాధ్యముకాదనుకొనెను. అట్లయ్యు దనకడనున్న బాహుకుడు వాయువేగ మనోవేగములను మించిన వేగముతో నరదమును నడుప గల దిట్టయని యెరుగుటచే నతనిని రప్పించి మందహాసమొనరించి మెల్లగ నిట్లనెను. బాహుకా ! విదర్భను బరిపాలించు భీమరాజు పుత్రి యగు దమయంతికి ద్వితీయస్వయంవరము ప్రకటింపబడినది. యేత న్మహోత్సవమునకు నేనాహ్వానింపఁబడితిని. విదర్భ యిచ్చటకు బహు దూరమందున్నది. స్వయంవర సమయమున కచ్చటికిబోవు తెరంగెద్ది ? అనెను. ఆ మాటలు బాహుక నామముతో వ్యవహరించుచున్న నలు నకు యీటుపోటులైనవి. తాను బ్రతికియుండగనే తన సతి మారు మనువుకొరకు బ్రయత్నించుచుంట యెట్టివానికేని గర్భనిర్భేదకము కదా ? తాను త్రికరణశుద్ధిగా బ్రేమించిన దమయంతి యీనాడు వేరొక పతికొరకు బ్రాకులాడుచున్నదన్న పలుకులు నలుని చెవులకు

ములుకులైనవి. అతఁడు క్షణములో తనదైన్యమును మనఃక్లేశమును మరుగుపుచ్చి లేసి చిరునవ్వు దెచ్చిపెట్టుకుని తన ప్రభువు నుద్దేశించి, మహాప్రభూ! యింతపాటిపనికై మీరింతగా వంతఁజెందనేల? నిర్ణీత కాలమునకు మున్నే మిమ్ము విదర్భాపురిం జేర్చుభారము నాయది. మీరు ప్రయాణసన్నాహమున నుండుడు. అని చెప్పి, తాను బయలు దేరి పోయి యశ్వశాలం బ్రవేశించెను. మున్ను నలుండు పదభ్రష్టుడై నప్పుడు అతని బిడ్డల నిరువురను రథముపై నిడుకొని మాతామహుని గృహమున జేర్చివచ్చిన భవుష్యుడు సహితము ఋతుపర్ణమహారాజు నాస్థానమునందే కొలువుసేయుచుండెనని చెప్పియున్నాను. ఆ భవుష్యుడు అశ్వశాలలోనికి బోయి బాహుకుని జూచి, బాహుకా! యిదియేమి విపరీతము? యోషిజ్జనదీపికయై తనకుగల సద్గుణసంపత్తిచే బేరెన్నికగన్న యన్నులమిన్నలకు సహితము వన్నెగూర్చు దమయంతీ దేవి యీనాడు మారుమగని బరిణయమాడ నున్నదా? మన మిరువురము శ్రీనలసార్వభౌముని కొలువు సేసినవారమేకదా! మనోవాక్కాయములచే బతినే దైవముగా భావించి, పతిసేవయే పరమార్థమని యెంచి మసలిన మహాసాధ్వి గదా? దమయంతి—ఆమె యింద్రాది దిక్పాలురు తన్నుబ్రేమించి మహావైభవమును అణిమాద్యష్టసిద్ధులను, నందనోద్యానవన సంచారమును, పారిజాతసుమములను, పూతమందాకినీ సలిలగాహనమును, ముప్పదిమూడుకోట్ల జేజేల జోహారులును, అనిమిషత్వమును, దయసేతుమని పాదములపై బడి ప్రార్థించినను, వాని నెల్ల దృణప్రాయముగా దలంచి, నలమహీజానిని దప్ప యితరుని బరిణయమాడనని దృఢముగా నుడివిన యాతల్లి యిట్టి దుష్కార్యమునకు బాల్పడునా? యిందేదియో మాయయున్నది. కాని యామెకు ద్వితీయస్వయంవరమనుట విశ్వసింపదగిన మాటకాదు. నలవియోగమే స్థిరమైననాఁడు ఆమె కాలపరిత్యాగమునకే సమ్మతించును గాని,

వేరొకని పెండ్లాడి వానితో కలుకుచు గాపురముసేయుట కిచ్చగించునా? అనెను. ఆ పలుకులు వినుటతోనే నలుడు కన్నుల నీరునించెను. పుండును గెలికినట్లు ఆతని హృదయమును భవుష్యుడు మొదలంట గలచివైచెను. ఆతడు భవుష్యునితో మిత్రుడా కాంతల చిత్తవృత్తులు యేరికిదెలియును? వారితో గలసిమెలసి చరించుచు వారి సాంగత్యసౌఖ్య మనుభవించిన మాత్రాన వారిహృదయము తమకు దేటబడిన దనుకొనుట బుద్ధిహీనతయేగాని వేరుగాదు. సత్యమెరింగిన చో కామినీహృదయ కావ్యరసగ్రహణమును నారికేళపాకముగదా? స్త్రీల కృత్రిమమందహాసములకును, మధుర సంభాషణములకును, అపాంగవీక్షణములకును బురుషులాసపడి, వారి వలయందు దగుల్కొని చెడిపోవుచున్నారు. నలుడు పదభ్రష్టుడైనంతనే దమయంతి యాతని విడిచి వేరొకని వెదకుచున్నది. అబ్బా! యెంతటి దురంతము? యెంత అన్యాయము తన్ను బ్రాణాధికముగా బ్రేమించిన పురుషుడు శనైశ్చరుని త్రిప్పులకులోనై, ముప్పులం గుడుచుచుండ నాదెప్పరము తనపై గప్పదా? ఆమె మహాపతివ్రతయని యనుటకు నీకు నోరెట్లువచ్చెను? పతి ప్రాణములతో నుండగనే వేరొకని నన్వేషించు సతి మహాపతివ్రతయా? మరియు నీ వృత్తాంతము విశ్వాసపాత్రము కాదనుచున్నావు భవుష్యుడా! నీకేల యీసందేహము. పురుషుల ప్రేమతత్త్వమునకును, స్త్రీల ప్రేమతత్త్వమునకును గావలసినంత భేదమున్నది. పురుషుడు తాను త్రికరణములచే బ్రేమించిన యువతి సౌఖ్యముకొరకు మహాత్యాగము లెన్నైని మొనరించును. స్త్రీవిషయమున నీనుడి చెల్లదు. తనసౌఖ్యమునకు భంగముకల్గిన మాత్రాన, నామెయె మగవాని రోయును. అనెను. యీ మాట లాలకించి భవుష్యుడు కొంచెమాగ్రహము పొందెను. బాహుకా! నీవు బుద్ధిమంతుడవు. విధివశమున నీవికారాకారముతో నిమ్మహీజానిని గొల్చు

మున్నావు. కాని సమస్తధర్మవేత్తవు. నీకు బోధపడని ధర్మార్థములు లేవు. అట్టిచో నీవే యింత అన్యాయమునకు నెట్టికొందువేల ? నలుని యాస్థానమున బనిజేసితినని చెప్పి దమయంతీదేవిని దూషింతువేల ? అమ్మహాసాధ్వి యొక్క మానసిక తత్వమును నీవు గ్రహింపక యిట్లనుటకు సాహసించితివి. ఇంద్రాగ్నియమవరుణులు తన్నుగోరి చనుదెంచినను వారినొల్లక దమయంతి నలుని బెండ్లియాడలేదా ? నలుని యందు అంత మక్కువగల మందయాన వేరొక మానవమాత్రునిప్పుడు గామించుననుట కేవలము హాస్యాస్పదముగదా ? స్వసౌఖ్యమునకు భంగము వాటిల్లినదని యామె ద్వితీయస్వయంవరమున కిచ్చగించినదనుట గొప్ప తప్పిదము. ఏలనందువా ? కేవలము సౌఖ్యానుభవమే యామె యాశయ మయ్యునయెడల సౌఖ్యప్రదాయకులగు దివ్యులను వదలి రాజమాత్రుడైన నలునేలవరించును. వరించెననుకొనుము నలుండు శని త్రిప్పులకులోనై పుష్కరునితో జూదమాడి రాజ్యమును ఓడి, నగరువీడి, భోగములు బాసి, సౌఖ్యములురోసి, దుర్గమారణ్యమునకు బోయినప్పుడు అమ్మహాసాధ్వి యేకవస్త్రయై యాతని ననుసరింపలేదా ? కేవలము సౌఖ్యానుభవమే ఆమె లక్ష్యమయిన యెడల నలునితో నడవులబడి కడలేని యిడుమల గుడువక పుట్టినింటకు బోయి పుట్టెడుబలగముతో గలసి హాయిగా సుఖించియుండును. యామె యట్లొనరించెనా ? లేదు. మీదుమిక్కిలి నలుడే పాషాణహృదయుడై కిటి, కేసరి శార్దూల గండభేరుండ ప్రభృతి భయంకరవన్యమృగసందోహాసంకులంబైన కారడవియం దామె నొంటిగావిడచి యామెకు జెప్పక యెచ్చటికో పోయెకదా ? అనెను. అంతలకు నలుడు మిత్రుడా ! అట్లుచేయుట నలుని మహాపరాధమని లోకము భావించుచున్నది. దమయంతి నడవిలో నొంటిగా విడిచిపోవుటలో నాతనికి జెడుతలంపేదియును లేదు. ఆతడు తనసౌఖ్యముకంటె దమయంతీ

సౌఖ్యమునే యెక్కుడుగ గోరియున్నాడు. తనకడ నున్నంతవరకు నాకీ కీడులు తప్పవనియు దానామెను విడచిపోయిన యెడల నెట్టులయిన విదర్భాపురింజేరి పుట్టినింటికిం బోయి కన్నులార ముద్దుబిడ్డల దిలకించి కొంతవరకైన మనశ్శాంతిం గల్గించుకొని సుఖంబుండగలదని నలుడాసించెను. ఆతని యభిప్రాయమును లోకులు సరిగా గ్రహింపకున్న జేయునదేమి? పోనిమ్ము. మనకా తగవులాట యెందులకు అనెను. భవిష్యుడు తన పనిమీద తాను చనెను. నలుడు వెల్లువవలె మాటిమాటికి పైకి పొంగిపొరలుచున్న దుఃఖమునరికట్టి స్వామికార్యతత్పరుండగుటచే వడిగాబరుగెత్తు నాల్గుగుర్రములను అమూల్యాభరణ ప్రభాభాసితం బగు కనకరథంబును బూన్చి, కేతనఛత్రచామరాదులు అమర్చి వానిం దెచ్చి రాజుమ్రోలం బెట్టెను. ఋతుపర్ణుండును జీనిచీనాంబరములు మౌక్తికహారములు, సుగంధద్రవ్యములు, సుమరాజిములు, రత్నస్థగిత కిరీటము మున్నగువానిచే శృంగారించుకుని మంగళవాద్యములు మ్రోయుచుండ, బ్రాహ్మణాశీర్వాదములు చెలగుచుండ, వందిమాగధుల కైవారము లెసగుచుండ, సరదారుల జెయి, జెయిధ్వనులు మిన్నుముట్టుచుండ, నాయత్తపరుపబడిన తేరునధిష్ఠించెను.

బాహుకుండగు నలుడు అశ్వముల తాటిం యెడమచేతింబూని, కుడిచేత చౌకట్టిఋతుపర్ణు నానతిపై నశ్వముల నదలించెను. గుర్రపు డెక్కల టకటకశబ్దములచే భూమ్యాకాశములు గజగజలాడుచుండెను. నేమిధ్వానముల యురవడి ప్రళయకాల నిర్ఘాతపత్రముం దలపింప జేయుచుండెను. కాని యరదము మాత్రము కంటికగబడుటలేదు. బాహుకుఁడు వాయువేగ మనోవేగములను మించిన వేగముతో రథమును విదర్భాపురిమార్గమును బట్టించి పోనిచ్చుచుండెను; కనుమూసి తెఱచునంతలో నయ్యది బహుయోజనముల దూరము సాగిపోవుచుండెను; దాని నడిచెలనరేఁగు ధూళిచే భూమ్యాకాశములు నిండి

పోయినది ; రథ నేమీధ్వానములకు దిక్కులు పిక్కటిల్లుచుండెను. ఈ ప్రకార మత్యంతచాకచక్యముతోను, మహోత్సాహముతోను బాహుకుం డరదమును దోలుచుండఁగా చూచి, ఋతుపర్ణ మహారాజు నిర్భరానందమును బొంది, " బాహుకా ! నీసారథ్యము నాకత్యంత సంతోషహేతువగుచున్నది. నీవలెఁ జాకచక్యముతో స్యందనమును నడపఁగల సారథి ముల్లోకములందు నెందును గానఁబడఁడు ; సూర్య సారథియగు ననూరునికంటెఁ గూడ నీవధికుండవు ; నిన్ను నేను హెచ్చుగ మెచ్చుకొంటిని. " అనెను. బాహుకుండా యయోధ్యాధీశుని పలుకులకుఁ గృత్రిమ మందహాసరోచిష్ణులను బ్రకటించెను. రథము పోవుచుండఁగా ఋతుపర్ణుని యుత్తరీయము వాయు సంచలనమున నెగరి క్రిందఁ బడిపోయినది. అప్పుడా భూమీశుఁడు, " బాహుకా ! బాహుకా ! రథమును దృటికాలమాపుము. నాయుత్తరీయ మెగిరిపోయినది. " అనెను. అనఁగా నలుం డరదము నాపుసరికి, మూఁడుయోజనముల దూరము గడచిపోయినది. ఋతుపర్ణుండు దన యుత్తరీయమును దెచ్చుకొని, " బాహుకా ! రథమును సాఁగిపోనిమ్ము. " అనెను. నలుండు యథాప్రకారము స్యందనమును నడపుచుండెను. కొంతదూరము గడచుసరికి, ఋతుపర్ణుఁడు బాహుకుని జూచి, " బాహుకా ! నీసామర్థ్యము శ్లాఘాపాత్రము ; ఇంతదనుక నిన్ను సామాన్యమానవునిగా భావించుచుంటినేగాని, నీయందలి యాధిక్యతను గుర్తింపనైతిని. మహత్తర శక్తిసంపన్నుఁడవగు నీకుఁ బ్రత్యుపకారము సేయఁదలఁచితిని. నేను నీకు విచిత్రాస్త్రవిద్యను నేర్పెదను ; నాకుఁగల యస్త్రవిద్యానైపుణ్యమును బ్రకటింతును. ఇదిగో ! ఈ బాటకుఁ బ్రక్కఁగా నొకతాండ్రవృక్షమున్నది ; చూచితివా ! దానికిఁగల యాకులన్నియును నాచే సంధింపఁబడిన బాణమువలన రంధ్రాన్వితములు గావలయును. " అని యమ్ములపొదినుండి యొక

శరమునుదీసి దానిని సమంత్రకముగాఁ దాండ్రవృక్షము మీఁదికి ప్రయోగించెను. ఆ యలుఁగు రివ్వుమను ధ్వనితోఁబోయి తాండ్ర చెట్టును గదిసి, యందున్న సహస్ర పత్రములకును, సుమసంచయ మునకును జిల్లులు కల్పించెను; బాహుకుం డత్యంతకుతూహల యత్తచిత్తుఁడై తాండ్రవృక్షమును సమీపించెను. ఋతుపర్ణమహా రాజుచే విడువఁబడిన బాణ మాచెట్టునకుగల ప్రతిపత్రమును ప్రతి పుష్పమును జొచ్చుకొని పోవుటను దిలకించి యత్యాశ్చర్యమందెను. అంతలో నాతాండ్రవృక్షమునందు బాహుకునకు శనైశ్చరుఁడు సాక్షా త్కరించెను. "నలమహారాజా! నీవు ధర్మస్వరూపుఁడవు; సత్య సంధుఁడవు; నీయట్టి సుగుణఖని ముల్లోకములందు నెందును గానం బడఁడు." అని శనైశ్చరుఁడు మందహాసాంచితవదనారవిందుఁడై నుడువఁగా, బాహుకనామముతో వ్యవహరించుచున్న నలుండు భక్తి యుక్తుఁడై గదిసి నిలువంబడెను. ఆసమయంబునఁ గర్కోటకుం డచ్చో టికి విచ్చేసి, నలునిఁ దానుమున్నుఁ గఱచినచోటఁ గాటువేసి, విష మును లాగికొనెను. తోడనే నలునకు భారమంతయుఁ దగ్గిపోయినట్లయి నది; కాని యింకను మేనిచాయ మాత్రము మాఱలేదు.

## — శనైశ్చరుఁడు నలునకు వరములిచ్చుట. —

అప్పుడు శక్తిమంతుఁడగు శనైశ్చరుఁడు నలసార్వభౌము నుద్దే శించి యాదరణమొప్పఁ జిఱునవ్వుతో నిట్లనెను. "ఓ నలమహారాజా! నీవు మహానుభావుండవు; సుగుణఖనివి; సకలార్థవిదుఁడవు; నీవెఱుం గని ధర్మములును, చదువని శాస్త్రములును, వినని యాగమరహస్య ములును, చూడని పుణ్యభూములును, చేయని దానములును ఎందును లేవు; నిత్యసత్యవ్రతుఁ డెవ్వఁడన్నఁ దొలుత నినుఁజెప్పి యితరులఁ జెప్పవలయును; విపక్షశిక్షాదక్షుం డెవ్వఁడనిన నీనామ ముచ్చ

రించి, పదులపెళ్ల నుచ్చరింపవలయును ; ధర్మపరాయణుం డవ్వాఁడవిన
నిన్ను వ్రేలితోఁజూపి అన్యులం జూపవలయును ; జితేంద్రియుఁ
డవ్వాఁడన్న నిన్ను వాకొని వేఱొకనిఁ దలపెట్టవలయును ; నీశౌర్య
మును—నీధైర్యమును— నీ స్థైర్యము ను—నీ హృదయగాంభీర్యమును
పొగడుటకే నెంతవాఁడను ? ధృతిచేత నీవు మేరుగిరికిని, వదాన్యతచేతఁ
గల్పవృక్షమునకును, ప్రతాపముచేత మజ్జనకుఁడయిన సూర్యభగవాను
నకును, నైర్మల్యముచేత వీతిహోత్రునకును, సౌందర్యముచేత మన్మథు
నకును సమానుఁడవు. ఓ రాజకులావతంసా ! దీనజనబాంధవుఁడవగు
నిన్ను నేనిడుమలపాలు చేసితిని ; నీభార్యయగు దమయంతీదేవి మహా
సాధ్వీమతల్లి ; యోషిజ్జనదీపిక ; ఆమె సత్ప్రవర్తనముచేత స్త్రీజన
ముల కెల్లరకును ఆదర్శనీయురాలు. అట్టి పతివ్రతాశిరోమణియొక్క
అద్వితీయ సౌందర్య లావణ్యాదులకేను విస్మయమొందితిని ; ఆమెను,
దక్కుంగల దిక్పతులవలెనే, పెండ్లి యాడఁగోరితిని ; కాని స్వయంవర
మహోత్సవంబున నిన్నుఁ గామించి యామె వివాహమాడినది. అయ్య
దియే నాక్రోధహేతువు ; నాటంగోలె నేను నీయెడ వైరభావమును
బూనితిని ; నిన్ను రాజ్యభ్రష్టునిఁ జేసితిని. పుష్కరునిచేత జూదమా
డించితిని. పాచికలలోఁ బ్రవేశించి, నీ కోటమిని, పుష్కరునకు విజయ
మును గలిగించితిని ; మీ నాలుబిడ్డలకు దుస్సహవియోగదుఃఖమును
గల్పించితిని. ఏకవస్త్రయైయున్న నీభార్య చీరనుండి నీకు భాగము
నిప్పించితిని ; పక్షులచే దానినిగూడ నపహరింపఁజేసితిని. రాజో
త్తమా ! అంతతో మిన్నకుండలేదు ; నిన్ను సర్పదష్టునిఁ గావించితిని ;
దర్శనీయము, మనోజ్ఞమునగు నీయాకారమును అడంచి, వికృతము,
అసహ్యాకరమునగు రూపమును నీకుఁ గల్పించితిని. ఇంతయేల ? నేను
నీయెడలఁ జేయనియపచార మొక్కటిలేదు. సర్వవిధముల నిన్ను

బాధించితిని ; శక్తివిహీనుం గావించితిని ; దైన్యమును [illegible] ; గౌరవము నడంచితిని ; సంతోషము నమయింపఁ జేసితిని ; దుఃఖమును హెచ్చించితిని ; నీచవృత్తి గల్పించితిని ; నీవు నాయపరాధముల సైరింపవలయును ; నాఅవజ్ఞతను క్షమింపవలయును ; నాతప్పిదమును మన్నింపవలయును ; నా యపచారములను మరచిపోవలయును. నేను నీయందుఁ బ్రసన్నుఁడనైతిని ; విగతక్రోధుఁడనైతిని ; న్యాయమైక బుద్ధితో స్వయంకృతాపరాధములనెల్ల సైరింపఁ బ్రార్థించుచుఁ బశ్చాత్తాపతప్తచిత్తుఁడనై, నీకుపకారము నేయఁగోరుచున్నాఁడను. కాఁబట్టి గతించిన విషయములనెల్ల మరచి, చిత్తోపశాంతినిఁ గలిగించుకొని, నలసిన వరములు వేఁడుమను గ్రహింతును.” నలుండు శనైశ్చరుని పలుకుల కలరెను ; సవినయముగను, భక్తియుక్తముగను అంజలి ఘటించి, మృదుమధురస్వరముతో మందహాసపూర్వకముగా నాత నితో—“ దేవా ! నేను మీకు భృత్యునివంటివాఁడను ; నన్నింతగా పెద్దసేసి పొగడనేల ? మీరు నాయెడల నపచారమెన్నటికిని జేయ లేదు ; విధివిధానము నుల్లంఘించుట కెవరికిశక్యము ! ఏప్రాణి యేసమ యమునం దేకష్టము ననుభవింపనయునో, దాని ననుభవింపక తప్పదు గదా ! కర్మానుగుణముగాఁ బ్రాప్తించు కష్టసుఖముల కేనుకలంగను ; శోకింపను; మఱియుఁ గష్టసుఖములను సమభావముతోఁ గైకొనుటయే మదభిప్రాయము. ఇఁక మీరు నాకు మహోపకారమొనరించితిరనియే నేను దలంచుచున్నాను. ఏలనందురా, వినుఁడు ; మనుజుని యాధిక్యత ఆపత్సమయముననే కనఁబట్టవలయును ; బంగారువన్నె గీఁటురాయి మీఁద గీచినగాని తేటపడదుగదా ! అటులనే నాయందు సుగుణసంపత్తి లేశమయిన నున్నచో నద్దానిని మీరు లోకమున కెఱుకపఱచితిరి ; నాకీర్తిచంద్రికలను వెలయింపఁజేసితిరి. నాకుఁ బేరుప్రతిష్ఠలను గల్పిం చితిరి. దేవా ! ఇంతకంటె నాకుఁ గావలసినదేమున్నది ? మఱియు

మనముభయులము బంధుకోటిలోనివారము. మీరు మావంశకర్తయగు సూర్యభగవానుని గర్భమున నుద్భవించితిరి. కాఁబట్టి, మనలో మనకు విభేదములేల ? వినుఁడు. ఏదైన నొక్కవరముం గోరుమని యాన తిచ్చితిరి గావున వేఁడుచున్నాఁడను ; నాచరిత్రమును శ్రద్ధాకుల స్వాంతముతో నాలకించినను, మన్నామమును స్మరించినను, మీయను గ్రహము గలుగవలయును ; అనఁగా అట్టివారికి మీవలని బాధ లేశ మయిన నుండఁగూడదు. మఱియు నీతాండ్రవృక్షచ్ఛాయను విశ్ర మించు ప్రజలకెన్నటికిని మీవలని బాధకలుగరాదు. ఇదియే నా ప్రార్థ నము. అనుగ్రహింపుఁడు.” అనఁగా శనైశ్చరుండు, “నలమహా రాజా ! నీవు కోరినవరములెల్ల ననుగ్రహించితిని. ఈక్షణమునందే నిన్ను విడిచిపోవుచున్నాఁడను. నీవు మరల నచిరకాలములోనే సమస్త భోగభాగ్యములను బొంది సుఖింతువు ; పుష్కరునితో జూదమాడి చతుస్సముద్రముద్రితంబగు ధరామండలంబును గెలిచికొందువు ; ఆలు బిడ్డలతోఁ గలిసి హాయిగా సుఖింతువు ; సర్వదా నీకు నేను మహోప కారములు గావించుచునే యుందును ; ఇఁక నాకు సెలవు.” అని పలికి యంతర్హితుండయ్యెను. నలుండును, నిర్భరానందకందళిత హృద యారవిందుండై, రథమున్నచోటికి వచ్చి, ఋతుపర్ణ మహీజానిని జూచి, “ఆర్యా ! తాండ్రవృక్షమునందుఁగల యాకులను, పూవులను గూడ మీశరప్రయోగమువలన రంధ్రాన్వితములైనవి. మీశరసంధాన నైపుణ్యము బృందారకబృందములకుఁగూడ సందర్శనీయము మాత్రమే గాక, ప్రశంసాపాత్రముగూడ నగును. నేనశ్వవిద్యను మీకు నేర్పఁ గలను. ఆ విద్యాప్రభావంబువలన నశ్వములను వశముచేసికొను ఉపా యములెల్ల గ్రాహ్యములగును ; అశ్వలక్షణంబులు తేటపడును. దానికి మాఱుగా మీరు నాకీయస్త్రవిద్యను నేర్పుఁడు.” అనెను. ఆమాటల కయోధ్యాధీశ్వరుండగు ఋతుపర్ణుఁడు సంతోషించి, అస్త్రవిద్యను

నలునకునేర్పి, ఆతనినుండి యశ్వవిద్యను సమగ్రముగా గ్రహించెను. అనంతర మచిరకాలములోనే నలుఁ డరదమును విదర్భాపురికిఁ బోనిచ్చెను. దమయంతీదేవి కోటబురుజులమీఁద నెక్కి యా రథగమనము నత్యంతకుతూహలముతోఁ బరికించెను. గుఱ్ఱముల నంతవడిగా నడిపించుట, అరదము నంతసామర్థ్యముతోఁ బోనిచ్చుట యనుకార్యములు దనహృదయేశ్వరుండగు నొక్క నలునికిఁదక్క అన్యులకు సాధ్యము గాకుండుట యామె యెఱుంగును. అందువలన నారథము ఋతుపర్ణ మహారాజునకుఁ జెందియుండదనియు నందుండు సారథి తన మనోహరుండగు నలుండనియుఁ దమయంతి తలంచి, నిశ్చయించుకొనెను. పిమ్మటఁ జారుల చారువచనంబులవలన విదర్భాధినాథుఁడు భీముఁడు ఋతుపర్ణమహారాజాగమనము నెఱింగెను. మంత్రిపురోహిత దండనాథ సామంత పురప్రముఖ ప్రభృతపరిజనులతోఁగూడ బయలుదేరి భీమకుండు ఋతుపర్ణుని కెదురేఁగి, తోడ్తెచ్చి, నగరునకు సమీపమునందుఁ గల యొక్క సుందరమందిరమునందు విడియఁజేసెను. నలుండును, రథంబును, రథశాలయందుంచి, యశ్వంబుల నశ్వశాలలోనికిఁ దీసికొనిపోయి యుచితవిధంబున వాని కాహారపదార్థములుపెట్టి, సౌఖ్యము విచారించెను.

## — దమయంతి తన చెలికత్తెలను నలునియొద్దకుఁ బంపుట. —

అనంతరము విదర్భాంతఃపురమునంగల దమయంతీదేవి, చెలికత్తెలనుబిలిచి, “ మీరు ఋతుపర్ణమహారాజు విడిచియున్న సుందర మందిరాంతర్భాగమున కరుగుఁడు. అందాతని సారథి మీకంటఁబడును. ఆతఁడే మన్నాథుఁడనుట నిక్కము. అందు సందియమనవసరము. కాఁబట్టి, సమయోచితసంభాషణ మొనరించి, యీ ద్వితీయస్వయంవర వృత్తాంతోత్పత్తికిఁగల హేతువును విశదీకరించి, యాతని హృదయ

గతాభిప్రాయములను గలయూపుసఁ దెలిసికొనిరండు.

అప్పుడా దాదులు భీమరాజపుత్త్రి చెప్పినచొప్పున ఋతుపర్ణుండున్న భవనాంతర్భాగమున కరిగి యందు సారథియగు నలునవలోకించి, ప్రక్కలకొదిగి నిలువంబడి యిట్లు నుడివిరి "ఆర్యపుత్త్రా! ఇదేమి! మీరూపమిట్లు వికృతమైనది. మీరు మూఁడేండ్లనుండియు ఋతుపర్ణునాశ్రయించుకొని యున్నవారుగారా! ఈ రూపవిభేద మొదవుట కేదయిన వరము కారణమగునా? అగుచో నిదియిట్లింతకాలముండును? మనోజ్ఞమగు మీతొల్లింటి సౌందర్యము మరల నెప్పుడు మీకుఁ జేకూరును? ఓహో! అదియా సంగతి! సూర్యసారథియగు అనూరుఁడు సారథ్యనైపుణ్యమున మిమ్ముఁ బోలినవాఁడు. ఆతఁడు ఖండితాంగుఁడుగదా! ఆతని కంగవైకల్యముండుటచేత, వర్ణవైకల్యము మీ కుచితమని మీరీ చాయను ధరించితిరా? పోనిండు. మీగాథ మాకేల? మీరెట్లున్న మాకేమి? మా మహారాజుగారి జామాత నిషధదేశాధీశుఁడగు శ్రీనలసార్వభౌముఁడు. ఆతఁడు ఋతుపర్ణునాస్థానమునం దుండెనని మాయొడయఁడు చారులవలన నాలకించి, ఆతనిని రప్పించుటకొఱకు మాదేవియగు దమయంతికి ద్వితీయస్వయంవరమని ప్రకటించెను; అట్లు ప్రకటించినచో, అయోధ్యాధిపతి ఋతుపర్ణుఁడాసపడి వచ్చుననియు, వానితో నలమహారాజుకూడ వచ్చుననియు మాయంతిపురిలోనివా రందఱు నూహించిరి. కాని, మావారల కోర్కె నెఱవేఱెనో, లేదో, ఆ యీశ్వరుఁడెఱుంగవలయును. అక్కటక్కటా! ఏమయిననేమి? ఆ నలుండు పాషాణహృదయుఁడు; ఆతని స్వభావ మతికర్కశము. పాపము! మాదమయంతీదేవి ముగ్ధ! అమాయకురాలు! కాకున్నచో భువనరక్షణదీక్షాదక్షులును, కామరూపులును, మహదైశ్వర్యసంపన్నులును, అగు ఇంద్రాగ్ని ప్రభృతి దిక్పతులు కోరివచ్చినపుడు, వారిని నిరాకరించి, యా మానవ

మాత్రుని వరించునా? వరించెనే యనుకొనుము. అట్టి ఖాతివల్ల నన్యాయముగాఁ బ్రవర్తింపఁదగునా? త్రికరణములచేతను బ్రేమించి, ప్రాణాధికముగా భావించి, నిష్కలంకముగఁ బ్రవర్తించిన మా దమయంతీదేవిని, క్రూరజంతుసంతాన సంకులంబును, నిర్మానుష్యంబును, మహాభయంకరంబును నగు మహారణ్యమధ్యంబున దిక్కులేని యేకాకినిగాఁ జేసి, యేకవస్త్రగాఁ జేసి, నిద్రాముద్రితగాఁ జేసి, చెప్పకుండ విడిచిపోయినాఁడే! అంతకంటె దారుణమింకేదయినఁ గలదా? తన్ను జీవనాధికముగాఁ బ్రేమించిన తన్వి కన్యాయముసేయుట ధవునికి ధర్మమా? పోనిండు. గతించిన సంఘటనములను గూర్చి విచారింప నేల? గతజలసేతుబంధనమేల? ఆనాఁడు జరిగినదేదో జరిగినది. విధి నిర్ణయమట్లున్నది. దాని కెవ్వరేమనఁగలరు? ఎవ్వరేమిసేయఁగలరు? ఈనాఁడయినఁ గరుణార్ద్రహృదయముతోఁ దమయంతీదేవియొక్క దైన్యమును గుఱితించి, రావలసినదికదా! పాప మాసాధ్వీమతల్లి భర్తృవియోగము నోర్వలేకున్నదే! మాసినచీర విడువకున్నదే! ఆభరణధారణ మంగీకరింపకున్నదే! కైసేత నొల్లకున్నదే! తల్లిదండ్రుల యోదార్పుఁ బలుకులకుఁ జెవియొగ్గకున్నదే! అన్నము ముట్టకున్నదే! చెలులతో మోమెత్తి మాటాడకున్నదే! కంట నిద్రపెట్టకున్నదే! నిరంతరము కన్నీరుమున్నీరుగా గార్చుచు, "హా నాథా! నాథా!" యని కలవరించుచున్నదే! అట్టి పతివ్రతాతిలకము నిట్లు కర్కశప్రవర్తనముతో నరయుట న్యాయమా? అనలుండు ధర్మవిదుఁడఁట! సత్యసంధుఁడఁట! ప్రసిద్ధపురుషుఁడఁట! సుజనాగ్రగణ్యుఁడఁట! ఆతని శాస్త్రాధ్యయన మేమయినది? సత్యసంధత యేమూల దాఁగినది? ధర్మదీక్ష యెందంతరించినది? సౌజన్యమేమూలకేఁగినది? అయ్యయ్యో! ఇంత దురంతమా? ప్రేమఫలమున కిది ప్రతీకారమా? అమృతదాతకు విషప్రధానమా? హా! అనలుండు కష్టదశయందు దేశాటన మేలచేయవలయును? పరరాజుల నెందుల

ఆశ్రయింపవలయునా? ఆశ్రయించుట కశ్రమాదులు లేరా! ప్రేమజూపుటకు మిత్రులులేరా? ఆదరించుట కాప్తులులేరా? మాట లాడుటకు బంధుగులు లేరా?" నలుండు వారి పలుకులనెల్ల విని, విస్మయాశ్చర్యవిషాదముల నొందెను. మాఱువలుకక, మిన్నకుండుట సమంజసము గాదనియు, నందువలన ననుమాన ముదయింపవచ్చు ననియుఁ దలంచి యాతఁడా చెలికత్తెల నుద్దేశించి, "మీరు నాకడ నిన్నిమాటల నాడుదురేల? నే నేమిచేయఁగలను? నేను నలుఁడను గానుగదా! ఆతఁడెవ్వఁడో యిప్పుడెందున్నవాఁడో, ఏకారణముచేత మీయెడ నీరీతిఁ బాషాణహృదయుఁడై ప్రవర్తించినాఁడో, నే నేమి యెఱుంగుదును? కాని, నా బుద్ధిసూక్ష్మతను బట్టిచూడఁగా నాకుఁ గొండొక సమాధానము స్ఫురించుచున్నది. ఆనలుండు ధర్మపరుఁడనియు, న్యాయైకతత్పరుఁడనియు, సుచితజ్ఞుఁడనియుఁ మీరు నుడువుచున్నారు గదా! అట్టివాఁడు దన ప్రియపత్ని నకారణముగా ఘోరమృగసంతాన సంకీర్ణమగు దుర్గమభయదారణ్యమున విడిచిపుచ్చునా? అట్లు విడిచిపుచ్చుటకుఁ దీరనిహేతువొండు లేకుండునా? ఆ యిల్లాలు, తనతో నున్నయెడలఁ గడలేనియిడుమలు గుడుచుననియు, నామె కష్టానుభవము తనకు దుస్సహమనియు, నామె నటవిడిచిపోయినచో నెట్టులో యితరులసహాయమువలన నామెతనతల్లిదండ్రులయొద్దకుబోయి సుఖింపఁగలదనియు, నలుండుభావించియుండును. ఆతని యభిప్రాయము సదభిప్రాయమేయయ్యు, దానిని లోకముసరిగా గ్రహింపలేకపోయినది. అందులకెవ్వ రేమిచేయఁగలరు? పోండు. మీదాటిని మీరుపోండు; నావలన మీకుఁ గాఁదగిన సాహాయ్యమేదియును లేదుగదా!" అనెను. చెలికత్తెలాపూజ్యుని పలుకులకు మాఱువలుకనోపకఁ దమయంతికడ కరిగి జరిగిన కథయెల్ల వినిపించిరి. అప్పుడామె, చెలులారా! ఆమహీపతి బహుసమర్థుఁడు; తనయందుఁ దప్పిదమున్నట్లు నర్తింపఁడు;

కానిండు ; మనకు మిగిలిపోయినదిలేదు. అతఁడే నా ప్రాణనాథుఁడను టకు సందేహములేదు ; కాని మీరొకపనిని చేయుఁడు ; అతఁడు పాక శాస్త్రమునందు సుప్రసిద్ధుఁడు ; అతనిచేత వండఁబడిన పదార్థములను స్పృశించినంతమాత్రానమోడుకూడ ఫలపుష్పశోభితమగు మనోహర వృక్ష ముగా మాఱును ; ముదుసలులు నవయౌవనోద్భాసితులగుదురు ; రోగు లారోగ్యవంతులగుదురు ; కనుక నాతఁడు వంటచేయు విధమును దెలిసి కొని, వండిన వంటకముల నడిగి, కొనితెండు. " అనెను. చెలికత్తెలు మరల బయలుదేరి నలుఁడు పచనముచేయుచున్న వంటశాలకు సమీప ముగా నగోచరస్థలమునందు నిలువఁబడిరి. వారాతనివంట నెఱుంగును బరిశీలించిరి. పిమ్మట నాతనిని గొన్ని వంటకముల నడిగి తీసికొనిపోయి దమయంతీదేవికిచ్చిరి. దమయంతీదేవి యావంటకముల రుచి కత్యాశ్చ ర్యమునొంది, అతఁడు దప్పక తన ప్రాణనాథుఁడేయని నిశ్చయించు కొని, తన ముద్దుబిడ్డలనిరువుర దోడ్కొనిపోయి, యాతనికిఁ జూపిరం డని చెలికత్తెలకు నియోగించెను.

—♦ నలుండు బిడ్డలనుజూచి దుఃఖించుట. ♦—

చెలికత్తెలు, బిడ్డల నిరువురను నలునియొద్దకుఁ గొనిపోయి, విడిచి, తామొక రహస్యప్రదేశమున నిలువంబడి జరుగనున్న సంఘట నములను గనిపెట్టుచుండిరి. అంత నలుండాబిడ్డలను ప్రేమపూర్వకముగా జేరఁచీరి, తనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొనెను ; తనివిదీఱ, నిండు చందురుని నందచందములచే ధిక్కరించుచున్న యాబిడ్డల ముఖారవిం దములను మాటిమాటికిని చుంబించుచుండెను ; వారి మృదులదేహ మును గాఁగిలించుకొనుచుండెను ; వారి ముంగురులను సవరించుచుం డెను. ఆనందవిషాదభావ సమ్మిళితముగాఁ గంటనీరు వెట్టుచుండెను. చెలికత్తె లాతని చర్యలం గన్నులారఁజూచి, తటాలున నెదుటికివచ్చి

లువఁబడి, "అయ్యా! ఈ బిడ్డలం జూచినంతనే, నీవు కంటఁ దడి ెట్టుచున్నావు. కారణమేమి?" అని యడిగిరి. "పసిబిడ్డలం గనఁ ెన్నచో నేరికి ప్రేమకుదురదు! చంటిబిడ్డలను జేరఁదీయుటకు బంధు ్వమే కావలయునా? నామిత్రుని బిడ్డలిరువురు సర్వవిధముల వీరిని ోలియుండిరి. వారియందలి ప్రేమ వీరియం దుద్యోతకమగుచున్నది" ని బదులు చెప్పిన, నలుని చమత్కారమునకును, వచనానైపుణ్యము కును చెలికత్తెలు కడుంగడు సంతసించి, వెంటనే దమయంతి యొద్దకు ోయి జరిగిన వృత్తాంతముఁ జెప్పిరి. ఆమె యింక సందేహ మనవసర ని తల్లిదండ్రులను బిలిచి, వారితో, ఋతుపర్ణమహారాజు నొద్దనున్న ారథియే తన భర్తయగు నలమహారాజనియు నందు సందేహమక్కఱ ేదనియు విన్నవించెను. తోడనే వారు, తమ ప్రయత్నము సఫలీ ృతమైనందులకు లోలోన హెచ్చుగా మెచ్చుకొనిరి.

## — సమావేశము. —

పిమ్మట భీమరాజు, మంత్రిసత్తముని బిలిచి, "అమాత్య శేఖరా! నీవు, అయోధ్యాపురాధినాథుని యొద్దకుఁ బోయి, మా మహా రాజుగారు, మీ సారథి నొక్కపర్యాయము చూడఁగోరుచున్నవారు; దయతో మా వెంటఁ బంపుఁడని చెప్పి, తోడ్కొనిరండు." అనెను. అనఁగా ప్రధానామాత్యుఁడు వెంటనే వెడలి, ఋతుపర్ణుని సందర్శిం చెను. భీమరాజు చెప్పినచొప్పున నుడివెను. తోడనే ఋతుపర్ణుఁడు నలుని రావించి, "సారథీ! సారథ్యమున నీవసమానుండవని భీమరాజు గారు కర్ణాకర్ణికగా వినియున్నవారు కాఁబోలును! నిన్నుఁ జూడఁగోరి, కబురంపినారు. వెడలిరమ్ము." అనెను. నలుండు యజమానుని మాటకు మాఱువలుకలేక, అమాత్యునివెంట బయలుదేరి, వెడలెను. భీమరాజు మంత్రిపురోహితాదులతో నలుని కెదురేగి తోడ్తెచ్చి,

సభామండపమునందు సౌవర్ణపీఠమున సుఖాసీనుంజేసి, మర్యాదను జూపుచుండిరి. అపుడు నలుం డాశ్చర్యమభినయించుచు, "ఆర్యా! ఇదేమి? మీరు రాజాధిరాజులు. నేను కేవల మొకసారథిని. నాకు మీరీ మర్యాదలు జరుపుట యుక్తమా?" అని ప్రశ్నించెను. అందులకు భీమరాజు చిఱునవ్వు నవ్వి, "మహాభాగా! ఎంతకాలము మీరీవిధముగ నుందురు? కాలము మంచిదయినపుడుగూడ మీకీ రహస్యవర్తనమేల? మీ నలరూపును మేమెల్లరము దెలిసికొంటిమి. మిమ్ములను రప్పించుటకే మేమీపన్నుగడను పన్నితిమి. లేకున్న, దమయంతీదేవికి ద్వితీయస్వయంవరము గావింతుమా? నిజముగా స్వయంవరమే యయిన నితరరాజుల కాహ్వానపత్రికలు పంపియుండమా? నగరము నలంకరించి యుండమా? పట్టణమునం దేనూాలను, ఎట్టిసందడియుం గాన్పించుట లేదుగదా! ఇయ్యది మామాటల కుదాహరణముగదా! మీరు, ఋతుపర్ణుని యాస్థానమునందుండిరని చారులవలనఁ దెలిసికొంటిమి. ఆతఁడిచ్చోటకు వచ్చినగాని, మీరు రారని యూహించితిమి. మిమ్ములను రప్పించుటకీనెపమును గల్పించితిమి. కాఁబట్టి, మాతప్పిదమును మన్నింపుఁడు. అర్థాంగి బాధల నికనయినఁ దీర్పుఁడు. ఆయమ దివ్యులంగాదని మిమ్ములను వరించినదికదా!" యనెను. అంతలో దమయంతియు, బిడ్డలునువచ్చి నలుని పాదపద్మములపై వ్రాలిరి. దమయంతీదేవి, బాష్పపూరితలోచనయై, "ప్రాణేశ్వరా! అర్థాంగినగు నన్నీరీతి నగచాట్ల నందించుట, అఖిలధర్మవేత్తలరగు మీకు న్యాయమా? నాహృదయము మీరెఱుంగనిదా? నాప్రేమతత్త్వము మీకు గోచరముకానిదా? అవ్యాజము—అగాధము—అనంతమునగు అనురాగముతో మిమ్ములను ప్రేమింపఁబట్టియేకదా, దిక్పతులను ధిక్కరించితిని. ఆనాఁడు మహారణ్యమధ్యమునందుఁ బ్రయాణంపు బడలికదీఱ. దమ యంకతలమునఁ దలయుంచి, గాఢనిద్రాపర

వశమై యుండఁగా, అయ్యయ్యో! నా కెటులు కపడకుండఁ బోవునది చాలకపోయెనా? నేను మీయర్థాంగినని యెఱింగియు నింతకాలము మిన్నకుందురా? నాపై నింత నిరాదరణమేల? నిరాదరణమున్న దనియే భావింతును. ఈ చిన్నిబిడ్డల ముఖారవిందముల నవలోకించి యయిన దయ వహింపరాదా? నాథా! మాఱుపలుకరేమి? మౌనము విడనాడరేమి? నోరెత్తి పలుకరేమి? ఆదరణము చూపరేమి? అను కంపఁ బ్రకటింపరేమి?" అని గద్గదస్వరముతో నుడివెను. అంత నలుని హృదయముకరఁగి నీరుగా ప్రవహించినది. అతఁ డాదరణపూర్వకముగా ప్రియపత్నిని గారవించెను; ముద్దుబిడ్డల నెత్తికొనెను. ఆ సమయమున నాభవనమునందెల్లయెడల నొక దివ్యజ్యోతి వెలువడినది. ఆ జ్యోతి మధ్యమునుండి, సర్వాంతర్యామియు—సర్వేశ్వరుండును—సర్వజ్ఞుండును—సర్వశక్తిమంతుఁడును— సారసాక్షుఁడును— సామగానలోలుఁడును నగు శ్రీమహావిష్ణుమూర్తి సాక్షాత్కరించెను. నలదమయంతులు భక్తితో సాష్టాంగనమస్కారములు గావించి పలు తెఱంగుల సంస్తుతించిరి. అంత శ్రీ మహావిష్ణువు—"ఓ దంపతులారా! మీ రన్యోన్యానురాగముతో ననేకసహస్ర దివ్యాబ్దములు సర్వసౌఖ్యము లనుభవింపుఁడు. మీరు ముల్లోకములకు నాదర్శప్రాయులు. ఇంత దనుక, శనైశ్చరుని ప్రభావము వలన మీరు నానాకష్టము లనుభవించితిరి. వానినెల్ల మరచిపొందు; లోకోపకారులై, దిగంతవ్యాప్త కీర్తిమంతులై యుండుఁడు. నేటితో మీకష్టములు గట్టెక్కెనని. మీకు శుభకాల మాసన్నమయినది. మీరాజ్యము మీకు లభించును." అని యంతర్హితుండాయెను. నలదమయంతులు, సనకసనందనాది మునిగణ దుర్లభంబైన శ్రీమన్నారాయణ సందర్శనభాగ్యము లభించినందుల కమందానందమునొందిరి. భీమరాజ దంపతులు. తమ కూఁతురును, అలునిఁగాంచి హర్షాంబుధినిఁ

దేలియాడిరి. ఋతుపర్ణుఁడు కడచిన వృత్తాంతమును దెలిసికొని, పరుగు పరుగునవచ్చి, నలుని పాదపద్మంబులపైఁబడి, "మహాభాగా! తమ యదార్థస్థితిఁ దెలియక, నేను దోషము లేవియయినఁ జేసియున్న మన్నింపవలయును." అని ప్రార్థించెను. నలుండు మందహాస పూర్వక ముగా నతనిని లేవనెత్తి, "ఆర్యా! మీరు నాకాశ్రయమిచ్చి, మహోపకారమే కావించితిరి. మీకు సర్వదా నేను కృతజ్ఞుడను." అనెను. పిమ్మట నలుండు కర్కోటకుని హృదయమున ధ్యానించి, దివ్యతేజోన్వితమగు తన తొల్లింటి రూపును బడసెను. అనంతర మాలు బిడ్డలతోను, పరివారముతోను నిషధదేశమున కరిగెను. పుష్కరునకు హాని కలిగింపక, అలుబిడ్డలతో వానిని దేశమునుండి పంపివైచి, సింహా సన మలంకరించెను. భరతఖండమునఁగల యేబదియాఱు దేశములనేలు రాజన్యులును, నలుని దర్శింపవచ్చి, అవనతమస్తకులై ప్రణమిల్లి, అమూల్య రత్నసంచయములను సమర్పించి, కప్పములు చెల్లించి, సెల వుఁగైకొని పోయిరి. నలుండు, దమయంతీదేవితోడను, ముద్దుబిడ్డల తోను సుఖంబుండి, చతుస్సముద్రముద్రితంబగు ధరామండలము నేకహేలగను, సర్వజనానురంజకముగను, సౌఖ్యప్రదముగను, అనేక సహస్ర దివ్యాబ్దములు పాలించెను. ఆదంపతుల నుపవిత్రనామమును సంస్మరించిన ప్రజలు, శనైశ్చరునిబారిఁబడక, సర్వసౌఖ్యము లనుభ వించుచుండిరి.

## ఉపసంహారము.

ఓధర్మనందనా! వినుము. ఆనలమహారాజు మీకంటెను బెక్కు కష్టము లనుభవించెనుగదా! అతఁడు పడినపాట్లలో మీపాట్లు సహ స్రాంశములైయుండవు. చివరకు శ్రీమన్నారాయణానుగ్రహంబున నాతఁడాలుబిడ్డలతో సుఖంబుండెనా? లేదా? శనైశ్చరుఁడు సహిత

మామహాత్మునియందుఁ బ్రసన్నుఁడై వరములను గ్రహించెనా? లేదా? నీకు మాత్ర మట్లేల జరుగదు? కష్టము లెన్నటికిని గాపురము లుండవు. వెన్నెలరాత్రులకుఁ బిమ్మటఁజీఁకటిరాత్రులును, వానికిఁబిమ్మట మరల వెన్నెలరాత్రులును వచ్చుట నీవెఱుంగనిదా! సకలధర్మ విశారదుండవగు నీకుఁ జెప్పవలసిన దేమున్నది? అమ్మహాత్ముని పవిత్ర చరిత్రము నాలకించి ధన్యుండనయితివి; దాని నెఱిఁగించుటచేత నేనును ధన్యుండ నయితిని; కనుకఁ గొందలపాటు నుడుగుము. కష్టసుఖములను సమభావముతోఁ గైకొనుము. నాకింక సెలవొసంగుము.” అని బృహదశ్వ మునీంద్రుండు పలుక ధర్మనందనుం డనుజులతోను, భార్యతోను, అమ్మహాభాగునిఁ బూజించి, పరితుష్టహృదయుం గావించి వీడ్కొలిపి, పిమ్మటఁ గష్ట మొదవినను, సుఖ మొదవినను నయ్యది విధినిర్దిష్టమనియు నేకాలమున కేదిరానున్నదో యది రాకతప్పదనియు, మానవ ప్రయత్నము దైవసంకల్పమునకు వ్యతిరిక్తమయిన నెన్నటికిని ఫలింపదనియుఁ దలంచి లేనిపోని విచారములుమాని సర్వదా మునిపూజనమునందును భగవద్భక్తియందును హృదయ మర్పించియుండెను.

సంపూర్ణము.

---

రాజమండ్రి: శ్రీసత్యానందప్రెస్‌నందు, ముంద్రింపఁబడినది.

# నవలలు

| | | | |
|---|---|---|---|
| పంజాబు మెయిలు | 0 12 | వ్యామోహము | 1 0 |
| విషహృదయము | 1 0 | ఫ్లవర్ గరల్ - పువ్వులపిల్ల | 0 12 |
| రమాసుందరి 1 వ భా॥ | 0 12 | అల్లరిపిల్ల | 0 12 |
| 2 వ భా॥ | 0 12 | రివాల్వరు | 0 12 |
| నీవేనా ? | 0 12 | శకుంతల బి. ఏ. | 0 12 |
| టోపీదాసు | 0 6 | చదువుకొన్న భార్య | 0 12 |
| శక్తికుమారి | 0 12 | అల్లూరి సీతారామరాజు | 0 6 |
| రక్తవాహిని | 0 12 | లోకాభిరామాయణం | 0 6 |
| యింద్రజాలము | 0 12 | దొంగలనాయకుడు | 0 12 |
| రాజద్రోహి | 0 12 | హాతింతాయి | 0 12 |
| వలపులరాణి | 0 12 | ఘోరహంతకుడు | 1 0 |
| అర్ధరాత్రపువింతలు | | కన్నపుదొంగ | 0 12 |
| 3 హత్యలు | 0 12 | మోహపిశాచము 1 భా॥ | 0 12 |
| అఘోరి | 0 12 | ,, 2 భా॥ | 0 12 |
| అగ్గిరాముడు | 0 12 | ప్రతాపసింహ 300 పే॥ గ్లేజు | 1 8 |
| నే నెవరిభార్యను ? | 1 0 | బాకుపోటు | 0 12 |
| నే నెవరిభర్తను ? | 1 0 | మగడుకానిమగడు | 0 12 |
| బలేపెండ్లి | 0 12 | రాజరత్నం | 0 12 |
| పాషాణికుడు | 0 12 | పగటిచుక్క 1 వ భా॥ | 0 12 |
| భయంకరుడు | 0 12 | ,, 2 వ భా॥ | 0 12 |
| నగేంద్రుడు | 0 12 | కాలసర్పం 1 వ భా॥ | 0 12 |
| ఏకోదరులు | 0 8 | ,, 2 వ భా॥ | 0 12 |
| ప్రతిబింబములు | 1 0 | 13 వ నెంబరు గది | 0 12 |
| ఆనందభవనము | 0 12 | వజ్రహారము | 0 12 |